ఫిబ్రవరి 1939




# విద్యార్థులారా! సిగ్గు సిగ్గు!!

[దుర్నడతగల యువకులను మందలిస్తూ, యువకులు మెలగవలసిన రీతిని వివరిస్తూ, గాంధీమహాత్ముడు ఒకయువతి తనకు వ్రాసిన జాబుకు జవాబునిస్తూ 26 డిసంబరు 1938 'హరిజన్' పత్రికలో యీ విధంగా హెచ్చరించాడు.]

రెండు నెలలయింది, పంజాబు దేశంలో ఒక కాలేజీలో చదువుతూవున్న ఓ విద్యార్థిని దగ్గరనుంచి నాకు వుత్తరం వచ్చింది. ఆ వుత్తరం చదువగానే నాహృదయం పెద్ద బాధపడింది. ఆ వుత్తరంలో ఆ అమ్మాయి వేసిన ఒక ప్రశ్నకు జవాబు వ్రాతామంటే నాకు టైములేదు. నాకు నిజంగా ఆప్రశ్నకు సమాధానం తెలిసివున్నప్పటికి, తీరికలేక కాలం జరుపుతూవచ్చాను. ఇంతలో అనుభవజ్ఞురాలైన మరివొక సోదరి దగ్గరనుండి మళ్లీ ఇంకో వుత్తరం వచ్చింది. అంతట ఇక జాగుచేయగూడదని, కాలేజి విద్యార్థినుల కష్టాలను నిర్వర్తించడానికి ఏదైతే ధర్మమైనదో అది నిర్వర్తించాలని సంకల్పించాను. ఆమె మంచి సరళమైన హిందూస్థానీ భాషలో ఆవుత్తరం వ్రాసింది. అందులో తెలిపిన విషయాలు, ఆమె మనస్సు పడ్డ బాధ నాకళ్లకు కట్టినట్లుంది. అంచేత ఆ విషయంలో, నా ధర్మాన్ని ఎంతవరకు నిర్వర్తించగలనో అంతవరకు నెరవేర్చడానికి ప్రయత్నిస్తాను. ఇదిగో! ఆమె వ్రాసిన వుత్తరంలో అవసరమైన కొంత భాగం.

"...స్త్రీలైనా, బాలికలైనా ఒక్కొక్కప్పుడు ఒంటరిగా, పట్నంలో ఓ మూలనుంచి మరో మూలకిగాని, ఓ వూరునుంచి మరో వూరుకుగాని వెళ్లవలసిన అవసరాలు కలుగుతూవుంటాయి. అల్లాంటి సమయాల్లో దుశ్చరిత్రులైన కొంతమంది వెంటబడి, అల్లరిగా ప్రవర్తించి, నోటికి వచ్చిన కారుకూతలు కూస్తారు. ఇంకా భయమనేది ఏ కోశాన్నీ లేకపోతే, తర్వాత ఏంచెయ్యడానికైనా వెనుదీయరు.

ఈ విషయాల్లో ఏ విధమైన దౌర్జన్యరాహిత్య సిద్ధాంతం పనిచేస్తుంది? అసలు ఆ సమయంలో జరిగేదంతా దౌర్జన్యమే. ఆ స్త్రీ గాని, బాలిక గాని కొంచెం ధైర్యంగలదైనట్టయితే, ఆ దుర్మార్గుడికి ఒక గుణపాఠం నేర్పడానికి ప్రయత్నిస్తుంది. ఒకవేళ చుట్టుప్రక్కల వుండేవాళ్లని కేకవెయ్యడానికని అరిచిందా ఆ దుర్మార్గుడు గబగబా పరుగెత్తి పారిపోతాడు. యిల్లాంటి పని, వానిని ఆ సమయంలో తాత్కాలికంగా తప్పించుకోవడమునకే గాని, శాశ్వతంగా వాడి బాధ విముక్తి కాదు. మరొకసారి వాడు వెనుకటి మాదిరిగానే ప్రవర్తించడానికి వెనుదీయడు. పోనీ ఒకవేళ అట్టి దుర్మార్గుడు కారుకూతలుకూస్తున్నా మనలను గాదని వూరకుని, చాలా సౌమ్యంగా ప్రవర్తిస్తే, వాడు ఒకవేళ జ్ఞానం తెచ్చుకుంటాడనుకుందాము. ఇక సైకిలుమీద పక్కనిపోతూ నానామాటలు అనే వానిమాట? అప్పుడు వానితో వాదించి నచ్చచెప్పడానికికూడా వీలెక్కడ? మళ్లీ వాణ్ణి కలుసుకోవడం తటస్థించదు. తటస్థించినా ఆనవాలు పట్టలేము.

ఈలాంటి విషయాల్లో అసహాయురాలైన స్త్రీగాని బాలికగాని ఏమి చేయగలదు? ఉదాహరణగా, క్రిందటిరాత్రి (26 అక్టోబరు) సంఘటిల్లిన నా అనుభవమును తెలియజేస్తాను. నేను నా స్నేహితురాలును నిన్నరాత్రి 7-30 గంటలకు ఒక జరూరు పనిమీద వెళుతున్నాము. అప్పుడు ఎవరైనా పురుషుణ్ణి తోడుగా తీసుకుపోదామంటే దొరకలేదు. ఇటు పని ఆపు చెయ్యడానికీ వీలులేదు. దారిలో ఒక సిక్కుయువకుడు సైకిలుమీద వస్తూ ఏవో అనటం ప్రారంభించాడు. అవి మాకు వినబడాలని మాకు వినబడేటంతదూరంలో వస్తూ అన్నాడు. వాడు మమ్మల్నే అంటున్నాడని మాకు తెలుసును. మాకు చాలాబాధ కలిగింది. రోడ్డుమీద అట్టేమంది జనంకూడా లేరు. మేము కొంచెందూరం పొయ్యేసరికి మళ్లీ వెనక్కివచ్చాడు అతడు. అతడు దూరంగా వున్నప్పుడే అతన్ని గుర్తుపట్టాము. అతను మా వైపే సైకిలు త్రొక్కుకుంటూవచ్చాడు. భగవంతునికి తెలుసు అతడు సైకిలుని మామీదినుంచి పోనిద్దామనుకున్నాడో ప్రక్కనించి పోదామనుకున్నాడో? అంతట మాకు ఆపదలో వున్నామని భయంకలిగింది. మేమేమైనా శరీరదారుఢ్యం వున్నవాళ్లమా అంటే అదీలేదు. మా బలంమీద మాకు నమ్మకంలేదు. ఒకసాధారణ బాలికకుండే బలంకూడ నాకు లేదు. కాని నా చేతిలో ఒక పెద్దపుస్తకం వుంది. ఎలాగొచ్చిందో ఏమో నాకో పిచ్చిధైర్యం కలిగి చేతిలో వున్న పుస్తకం బలంకొద్దీ అతనిమీద విసిరి గట్టిగా కేకవేశాను "ఇంకెప్పుడూ చెయ్యవు గదా యీలాంటిపనులు?" అని. ఎంతో కష్టంమీద సైకిలు నిలబెట్టుకుని బలంగా త్రొక్కుకుంటూ పారిపోయాడు. అప్పుడు నేనా పుస్తకాన్ని విసరకుండా వున్నట్టయితే, వెంటబడి నానా కారుకూతలు కూసేవాడు, మా ప్రయాణం ఆఖరయ్యేదాకాకూడా వచ్చి. అయినా ఇదొక నామరూపాల్లేని సాధారణ సంఘటన. కానీ, మీరు లాహోరు ఒక్కసారి వచ్చి మేము చెప్పే హృదయవిదారక చర్యలన్నిటిని వింటే, దీనికొక

## విద్యార్థులారా! సిగ్గు సిగ్గు !!

విమోచన మార్గాన్ని మీరు కనిపెట్టగలరు.

సరికాని, ప్రప్రథమంలో నాకు చెప్పండి; పైన చెప్పిన సమయాల్లో బాలికలు అహింసా సూత్రానికి బద్ధులై తమ ఆపత్తులనుండి కాపాడుకో గలరేమో! ఇక రెండో విషయ మేమిటంటే, ఇలాగ ఆడవాళ్లని అవమానపరచే దుశ్చరిత్రులగు యువకులకు మందేమిటి? మీ రీ విషయంలో 'శాంతాహింస సూత్రాలకి బద్ధులై, స్త్రీల విషయంలో చాలా వినయగౌరవాలతో మెలగాలని చిన్నప్పటినుండి నేర్పబడి, అట్టి జ్ఞానము కలిగిన వారితో నిండినకాలం వచ్చేవరకు ఓర్పు కలిగి వుండమ'ని మాత్రం చెప్పవద్దు.

ప్రభుత్వంకూడా యీ విషయంలో ఏమి చెయ్యడానికి యిష్టంలేకనో, లేక చేతగాకనో వూరుకుంది. పెద్ద పెద్దనాయకులికి సైతంలేదు యీలాంటి విషయాలనిగురించి ఆలోచించడానికి. కొంతమంది, చెడ్డగా ప్రవర్తించిన ఒకయువకునికి ఒక బాలిక బాగా బుద్ధి చెప్పిందన్న సంగతి వింటే, 'అరే! అల్లా ప్రవర్తించాలి ప్రతిబాలికాను, యిల్లాంటి విషయాల్లో' అంటారు.

కొంతమంది యీలాంటి బాలుర చెడునడతలని గూర్చి వుపన్యాసాన్ని మాత్రం జోరుగా విసురుతారు. కాని ఆచరణలోకి మాత్రం తీసుకోరు ఇటువంటి ముఖ్యమైన విషయాన్ని. మీకు ఆశ్చర్యమేస్తుంది నేనో విషయం తెలియజేస్తే! దీపావళి పండగరోజుల్లో 'వీధుల్లో జరిగే బాణసంచా వేడుకలు చూడడానికి ఆడవాళ్లు రాకూడదు. చాలా అపాయం. జాగ్రత్త!' అని వార్తాపత్రికల్లోకూడా ప్రకటిస్తూవుంటారు. ఇది ఎంత హృదయ విదారకమైన సంగతో మీరు గ్రహించుకో గలరు. యీ ప్రపంచకంలో మే మెటువంటి పరిస్థితులలోకి తిరుమబడ్డామో! ఆ వ్రాసే వారిగాని, ఆ చదివేవారికిగాని, లజ్జాజ్ఞానము లేవు గాబోలు యిటువంటి విషయాలు ప్రకటించడానికి......"

ఈవుత్తరాన్ని యింకో పంజాబు యువతి కిచ్చాను చదవమని. ఆమె అందులోవున్న విషయాల్ని బలపరుస్తూ, తన విద్యార్థి జీవితములోని కొన్ని విశేషాలను వివరిస్తూ, యీ విలేఖరి వుత్తరంలోని విషయాలన్నీ సాధారణంగా ప్రతిచోటా జరుగుతూవుంటాయని చెప్పింది.

ఇక అనుభవజ్ఞురాలైనయువతి వ్రాసిన రెండోవుత్తరంలో, లక్నోలో ఆమెస్నేహితురాండ్రు అనుభవిస్తున్న యిట్టి అవమానాలు, సినీమాలో వెనకాల కుర్చీలలోకూర్చుని చేసే అసభ్యభాషణాలు మొదలైన విషయాలను పేర్కొంది. ఇట్టి వాటిని అయోగ్యమైన అయుక్తమైన చర్యలు అంటాను. అంతకంటే వేరేఅనలేను. ఇంకా ప్రత్యక్షముగా కొన్ని వికృతచేష్టలు చెయ్యటానికి కూడా వాళ్లు సిద్ధపడ్డారని వ్రాసిందామె. కాని వాటినన్నిటిని యిక్కడ వ్రాయటానికి నాకు మనస్కరించడంలేదు.

యీ విలేఖరివంటి బలహీనమైన బాలికలకు అటువంటి విషమసమయాల్లో తక్షణ నివారణోపాయం ఏదైనా కావాలంటే ఆ యువతి చేసిన పుస్తకం విసరడంలాటి పనులను మించిన నివారణోపాయంలేదు. అది పురాతనకాలపు పద్ధతి. నేనిదివరకు చెప్పినట్లు, ఒకబలమైనవ్యక్తితో ఒకబలహీనమైనవ్యక్తి దెబ్బలాడవలసిన అవసరం వచ్చిం

దంటే ఆవ్యక్తి బలహీనత లేన తీవ్రతనంతా చూపించడానికి అడ్డురాదు. అదీగాక యీ నవీనకాలంలో చంటిపిల్లయినా కొంచెం తెలివితేట లుపయోగించి మారణవిషయాలతోగూడా మెలగుతూవుండడం మనం చూస్తూనేవున్నాము. ఈ రోజుల్లో యీ విలేఖరి వ్రాసినటువంటి సమయాలలో ఎల్లా ప్రవర్తించాలో నేర్చుకోవడం ఒక ఫాషన్ అయిపోయింది.

ఇంక దుర్భావలనువినే టటువంటి సమయాల్లో, ఆశ్చర్యచకితులై పోయివున్నా కూడా, అలక్ష్యంకూడదు. అల్లాంటి సంఘటనలు పత్రికల్లో ప్రకటింపబడాలి. ఆదోషుల పేర్లుకూడా పత్రికల్లో ప్రకటింపబడాలి వాళ్లు పట్టుబడితే. ఈ సంఘటనని వెల్లడిచేసేటప్పుడు నిజందాచకుండా వున్నదున్నట్టు చెప్పెయ్యాలి. ఇలాంటి బహిరంగమైన దుర్నడతమీద ప్రజాభిప్రాయం అవసరం లేదు. యీ విలేఖరి వ్రాసినట్లు, పూర్తియైన అయిష్టత అంతటావున్నదనటానికి సందేహం లేదు. కాని యీవిషయాలలో ప్రజాబాహుళ్యాన్ని ఎలానిందిస్తాము? వాటికి యీలాటి దుర్నడతలయొక్క ఉదాహరణ లుండాలి. ఏదైన దొంగతనం విషయమై విచారించవలసియుంటే అల్లాంటి చోరత్వాలు ప్రకటింపబడి వుండాలి, విచారణవిషయంలో అనుసరించటానికి. అల్లాగే ఇదిగూడా చాలాకష్టం, యీలాంటివిషయాలు ఎక్కడివక్కడ మటుమాయంచేసి పైకిరాకుండా చేస్తే, నేరాలు, చెడ్డతనాలు ప్రజ్వలించాలంటె చీకటికాలమే అవశ్యం. దానిమీద సత్యమనే వెలుతురు ప్రసరింపబడిదంటే అవి అదృశ్యమైపోతాయి ఎక్కడివక్కడ.

కాని 'నవీనయువతి సీతాకోక చిలకలా తయారయి వుండాలనుకుంటుంది, పదిమంది పురుషుల్ని ఆకర్షించడమే అభిప్రాయంగా పెట్టుకుని' అని సందేహంగా వుందినాకు. యీ విలేఖరి మామూలుగా అందరిలాగే వుంటుందనుకుంటాను నవీనయువతి పురుషుల్ని ఆకర్షించడానికేతప్ప, ఎండ, చలి, వాన మొదలైన వాటినుండి కాపాడుకోవడానికి దుస్తులు ధరిస్తోందనుకోను. అసాధారణంగా కనపట్టానికి ప్రకృతి సహజంగా వున్న ఆకారానికి రంగులువేసి, దుస్తులువేసి మెరుగులు పెడుతుంది.

దార్ఢ్యరాహిత్యసిద్ధాంతం మనలో వృద్ధి పొందడానికి చాలా నియమాలు, విషయాలు గమనించవలసివుందని ఇదివరకెన్నోసార్లు చెప్పేవున్నాను.

అది చాలా కష్టసాధ్యమైన పని. అది జీవితములో ఒక మహత్తరమైన విప్లవాన్ని తీసుకొస్తుంది. యీ విలేఖరి, ఆమెలాంటి యితరులు, ముందు వెనుకలు చర్చించి ఆలోచించుకుని మెలగితే, అది తమ జీవితంలో మహోజ్వలమైన ఒక నూతనవికాసాన్నిస్తుందని నమ్మి సంచరిస్తే, వారిదగ్గరకు వచ్చే యువకులు జ్ఞానం తెచ్చుకుని వారిని గౌరవిస్తారు.

ఇంక వారి శీలసౌశీల్యాలకి అపాయం కలిగే అసాధారణపరిస్థితులు సంభవిస్తే, పురుషుని మౌఢ్యానికి లోబడకుండావుండడానికి చావుకైనా సిద్ధపడే ధైర్యస్థైర్యాలు సంపాదించాలి స్త్రీలు. కాని, ఒకయువతి కదలడానికైనా వీలులేకుండా కట్టివేయబడిన ఆసమయంలో ప్రాణత్యాగం చేయటం, నే తలచినంత సులభంకాదనే అభిప్రాయం కలుగవచ్చు. కాని ఆయువతికి పట్టుదలనేది వుంటే ఆమెకు వేయబడ్డ బంధాలనన్నిటిని తెంపివేయగల శక్తి దానంతట దేపుడుతుంది అని చెప్పటానికి వెనుదీయను. ఆ క్లిష్టపరిస్థితి ఆమెకు తప్పకుండా మరణించేందుకు కూడా శక్తినిస్తుంది.

కాని, యీ ధైర్యమైన త్యాగంచేయడానికి ఎవరైతే నిశ్చలమైన అనుభవాభిప్రాయాలు కలిగివుంటారో వారికే వీలౌతుంది. ఎవరికైతే యీ దౌర్జన్యరాహిత్య సిద్ధాంతంలో జీవంలేదనే నమ్మకముంటుందో వారికి, యీ దుర్నడతగల యువకులబారినుండి కాపాడుకొనేందుకు, సాధారణరక్షణలు మాత్రమే వుంటాయి.

ఎందుచేత యీ యువకులందరు యిట్టి చిన్నచిన్నమర్యాదలనుండికూడా దూరస్థులై సచ్చరిత్రలైన యువతులందరికి భయభ్రాంతులౌతున్నారు? అధిక సంఖ్యాకులైన యువకులు సత్ప్రవర్తననే జ్ఞానలేశం లేనివారైపోతున్నారని చెప్పడానికి నేను చాలా విచారిస్తున్నాను. కాని, వారి మర్యాదలను వారు కాపాడుకొనేందుకు అన్ని విధాలా చాలా జాగ్రత్తగా ప్రవర్తించాలి. తమ తల్లులయొక్క, అక్కచెల్లెండ్రయొక్క మర్యాదపైన వారి కెంత ప్రేమ శ్రద్ధవుంటుందో, పరస్త్రీయొక్క మర్యాదకూడా అటువంటిదే అనే విషయజ్ఞానం సముపార్జించాలి. వా రెంతెంత పెద్దవిద్యల నభ్యసించినా అంతా వృథా, సత్ప్రవర్తన లేకపోతే.

ఈ సత్ప్రవర్తన, పెద్దమనిషి తరహా పాఠశాలలలో నేర్పడానికి ఏ వుపాధ్యాయుడి బాధ్యతా కాదు; అట్లు కానేరదు కూడాను.

సైగాను,
26–12–38

యం. కె. గాంధి.

# భారతీయనారి భవిష్యత్తు

స్వామి వివేకానంద

**నారీపూజ నొనర్చియే జాతులన్నియు ఉన్నతిని బొందినవి. ఏదేశమున ఏజాతియందు నారీపూజ లేదో, ఆదేశము జాతి ఉన్నతినెప్పుడును గాంచలేదు, కాంచదు. మీజాతి ఇంత అధఃపతితమగుటకు ప్రధానకారణము—ఈశక్తి మూర్తులను అవమానించుట.**

●

నాకు మాటిమాటికి వేయబడిన ప్రశ్న—మీరు విధవలయొక్కయు, సమగ్ర నారీజాతియొక్కయు ఔన్నత్యోపాయమును గురించి ఏమి తలంతురు? నే నీ ప్రశ్నకు తుట్టతుది జవాబు నిచ్చుచున్నాను—నేను విధవనా ఏమి, నన్ను పనికిమాలిన విషయము నడుగుచున్నావు?. నేను స్త్రీనా ఏమి, మాటిమాటికీ ఈప్రశ్న నడుగుచున్నావు? నీ వెవరవోయి, స్వతంత్రించి నారీజాతి సమస్యను సమాధానింప అగ్రగామి వగుచున్నావు. నీవు ప్రతి విధవయొక్కయు రమణియొక్కయు అంతర్యామివగు భగవంతుడవా ఏమి? దూరముగనుండుము. వారే వారి సమస్యను పూరించుకొనెదరు. మీరు అందరికొఱకు అంతటిని ఒనర్పగలమని తలచుచున్నారా! దూరమునకు బొండు. ఈశ్వరుడందరిని గాంచును. నీ వెవరవోయి, నిన్ను నీవు సర్వజ్ఞునివిగ ఎంచుకొనుచున్నావు. ఓ నాస్తికులారా! ఈశ్వరునిపై ఈశ్వరత్వమును వహింపబోవు సాహసమెందులకు? ఆత్మలన్నియు పరమాత్మస్వరూపములని మీ రెఱుంగరా? మీపని మీరు చూచుకొండు. మీ నెత్తినబరువు తక్కువగనున్నదా? మీ జాతి అంతయు నిన్ను నెత్తికెక్కింపవచ్చును. మీ సంఘము చప్పట్లు చఱిచి ఆకాశమునకు లేవనెత్తవచ్చును. మూఢులు ప్రశంసింపవచ్చును. కాని, ఈశ్వరుడు నిద్రించుటలేదు. ఆయన నిన్ను పట్టుకొనును. ఈ లోకమునగాని, పరలోకమునగాని తగిన శాస్తి నొనర్చును. అందువలన ప్రతి నరనారిని సకలమును ఈశ్వరదృష్టితో గాంచుము.

సంస్కారమొనర్ప బూనిన పైపైనబాదిన చాలదు. లోన ప్రవేశించి మూలమువఱకు చూడవలెను. దీనినే నేను ఆమూలసంస్కారము, అసలుసంస్కారమందును. మూలమున నిప్పంటించుము. నిప్పు క్రమముగ పైకిలేవనిమ్ము. ఒక అఖండభారతీయజాతిని నిర్మింపనిమ్ము.

సంఘసంస్కారమును గోరువారెచ్చట? ముందు వారిని ఒనగూర్చుము? సంస్కారప్రార్థులెరి? అల్పసంఖ్యాకులగు కొందఱికి ఒకానొక విషయము దోషముగ కన్పించినది. చాలమందికి అది తెలియనే తెలియదు. ఇక ఈ అల్పసంఖ్యాకులు తీవ్రముగ ఇతరులపై తమకు నచ్చిన సంస్కారమును ప్రయోగింప యత్నింతురు. ఇట్టి అత్యాచారము మఱొకటి జగత్తునలేదు. అల్పసంఖ్యాకులగు కొందఱి జనులకు దోషబోధ అయినంతమాత్రముననే నయ్యది జాతియొక్క హృదయమును స్పర్శింపదు. జాతి అంతయు కదలదే మెదలదే—కారణమేమి? మొదట జాతి కంతటికిని విద్యనొసగుము. వ్యవస్థనొనర్ప సమర్థమగు దళమును సృష్టింపుము. విధానము దానియంతట నదే

వచ్చును. మొదట ఏ శక్తిబలమున, దేని ఆమోదమున విధానము నిర్మితమగునో దానిని సృష్టింపుము. ఇప్పుడు ప్రాచీనరాజులు లేరు. ఏ నూతనశక్తివలన, ఏ నూతన సాంప్రదాయాంగీకారమున నూతనవ్యవస్థ ప్రణీతమగునో, ఆశక్తి? మొదట ఆ లోకశక్తిని నిర్మింపుము. కనుక, సంఘసంస్కారమునకు ప్రథమ ప్రయోజనము లోకశిక్ష. ఇది లభించునంతవఱకుపేక్షింపవలసియుండును.

పనికిమాలిన సంఘసంస్కారమును దీసికొని కలియబెట్టకుము. ఆధ్యాత్మిక సంస్కారము లేకున్న సంఘసంస్కారము కాజాలదు. నేను సంఘసంస్కారమును గోరువాడనని నీకెవ్వరు చెప్పినారు? నేను దానిని గోరను. ఈశ్వరనామమును ప్రచారమొనర్పుము.

భారతదేశమున ఎట్టి సంస్కారముగాని ఉన్నతినిగాని ఒనర్ప యత్నించుము. (ప్రథమమున ఈ వ్యాసమున ధర్మశబ్దము మతశబ్దమునకు ప్రత్యేక ప్రయోగింపబడినది.) ధర్మప్రచార మావశ్యకము. భారతమున సాంఘిక లేక రాజకీయనైతిక భావప్రవాహమును ప్లావింపగోరిన ఆధ్యాత్మిక భావప్రవాహములో ముమ్మొదట దానిని నింపవలెను.

నాకు సంస్కారమున విశ్వాసము లేదు. నాకు స్వాభావిక ఉన్నతియందు విశ్వాసమున్నది. నేను నన్నీశ్వరస్థానమున నిల్చికొని సంఘమును 'ఈవైపునకు వెళ్లుము, ఈవైపునకుగాదు' అని ఆదేశింప సాహసించలేను. జాతీయజీవనపుష్టికై ఆవశ్యకములను వానిని ఇచ్చిపొమ్ము. అది దాని ప్రకృతి ననుసరించి తన దేహమును నిర్మించుకొనును.

'ఉద్ధరేదాత్మనాత్మానం'-నిన్ను నీవు ఉద్ధరించుకొనుము. ఎవరికి వారే తమ్ము ఉద్ధరించుకొందురు గాక! సర్వవిషయముల స్వాధీనత ముక్తివైపుకు అగ్రగమ్యులగుటయే పురుషార్థము. ఇతరుల శారీరక, మానసిక, ఆధ్యాత్మిక స్వాధీనతవైపుకు అగ్రసరులగుటకు తోడ్పడి నీవుగూడ ఆవైపునకు ఏగుటయే పరమ పురుషార్థము. ఏ సాంఘిక నియమములు ఈ స్వాతంత్ర్య వికాసమునకు వ్యాఘాతమును గలిగించుచున్నవో అయ్యవి అమంగళకరములు. అట్టి వానిని శీఘ్రముగ నాశనమొనర్చుట ఉచితము. ఏ నియమముల జీవులు స్వాతంత్ర్యపథమున అగ్రసరులవగలరో అట్టి నియమములను నిల్పవలెను.

అగుచో ఆత్మత్యాగము ధర్మము కాదా? 'బహుజనహితాయ' ఒక్కని సుఖమును ఒకని శ్రేయమును అర్పించుట అనునదొక్కటియే పుణ్యము కాదా? మంచిమాటయే, కాని మా భాషయందొక సూక్తి యున్నది. అది 'నూరితోమిన రూపమువచ్చునా? పట్టి కట్టిన ప్రీతిలభించునా?' భావరహితుడును హృదయవిహీనుడును ఉన్నతఆశాహీనుడును, సమాజమున్నదో లేదో తెలియనివాడును అగువానికి ఆత్మోత్సర్గమేది? బలవంతముగ సతులను గాల్చుటయేనా సతీత్వముయొక్క వికాసము? కుసంస్కారముల జొన్పి పుణ్యమొనర్పించుట యెందులకు? సంఘము కొఱకు నీవు నీ సమస్తము వెచ్చుచు బలినిచ్చినప్పుడు నీవు బుద్ధుడవగుదువు, నీవు ముక్తుడవగుదువు, ఇయ్యది చాలదూరమున. దీనికి మార్గము బలాత్కారమా? 'ఆహా! ఈదేశపు విధవలు ఎట్టి నిఃస్వార్థత్యాగమునకు దృష్టాంతస్థానీయులు! ఇట్టిది మఱియొక్కటున్నదా? ఆహా! బాల్యవివాహ మెంత మధురము! ఆ స్త్రీపురుషులకు ప్రేమపుట్టకుండునా?' అని చెప్పుచు, మూల్గులు వెల్వడుచున్నవి. ఇంక పురుషులమాటా—

భారతదేశ కళ్యాణము స్త్రీజాతి కభ్యుదయము లేనిచో సంభవింపదు. ఒకే రెక్కయున్న పక్షి లేవలేదు. అందువలననే శ్రీరామకృష్ణావతారమున స్త్రీ గురు గ్రహణము, నారీభావసాధన, మాతృభావ ప్రచారము; అందువలననే స్త్రీల మఠమును స్థాపించుటకు మా ప్రథమ ఉద్యమము.

ప్రభూ! ఇప్పుడు గ్రహించుచున్నాను. మేము మహా పాపులము—స్త్రీలను గర్హ్య-కీటములు, నరక మార్గము-అని చెప్పినందులకే అధోగతి. బాబో! ఆకాశపాతాళ భేదము, ప్రభువు నోట పల్కులకు మరచునా? ప్రభువు చెప్పినాడు 'త్వం స్త్రీ, త్వం పుమానసి, త్వం కుమార ఉత వా కుమారీ.' ఇక మనము చెప్పుచున్నాము—'దూరమపసర రే చండాల'; 'కే నైషా నిర్మితా నారీ మోహినీ.'

ప్రతి నరనారీయును, ప్రతి బాలబాలికయును ఎట్టి పని నైన ఆచరించుచుండనిమ్ము. ఎట్టి అవస్థయందైన ఉండనిమ్ము, సర్వత్ర వేదాంత ప్రభావము విస్తృతమగుట అవశ్యకము. అందఱికిని వారి అత్యంతరీణమగు బ్రహ్మతత్త్వమును గుఱించి ఉపదేశ మొసగుము. ప్రతియొక్కరును వారంతటవారే వారి ముక్తిసాధనమును సల్పుదురు. ఉన్నతికగు ప్రథమ ప్రయోజనము స్వాధీనత. మీలో నెవరైనా నేను 'ఫలానా' స్త్రీకిగాని, బాలునికిగాని ముక్తి నొసగుదునని చెప్ప సాహసించిన అది అత్యంత అన్యాయవచనము, తప్పుకూత అనవలెను.

చింత, కార్యములయొక్క స్వాధీనతయే జీవనము. ఉన్నతియొక్కయు, సుఖముయొక్కయు ఏకమాత్ర సహాయ్యము. ఎచ్చట నిది లేదో ఆ మనుష్యుని జాతియొక్కయు పతనము అవశ్యం భావ్యము.

క్రైస్తు స్త్రీలకు పురుషతుల్యాధికారము నొసంగ లేదు. స్త్రీలే అతనికొరకు అంతయు నొనరించిరి. కాని ఆయన యూదీయుల ఆచారములకు బద్ధుడై ఒక్కనారి నైన తన శిష్య (Aportle) పదమునకు లేవనెత్త లేదు. బుద్ధుడు ధర్మరాజ్యమున పురుషులతో గూడ స్త్రీలకు సమానాధికారమును అంగీకరించినాడు. అతని భార్యయే ఆయన ప్రధాన ప్రథమశిష్య. ఆమె బౌద్ధభిక్షుణుల అధినాయిక అయ్యెను.

స్త్రీ సంబంధములగు ఆర్య, సెమిటిక్ ఆదర్శములు రెండటినుండియు సంపూర్ణముగ విపరీతములు. సెమయిట్లు స్త్రీల ఉపస్థితి ఉపాసనకు ఘోరవిఘ్నమని తలచెడువారు. వారి మతమున స్త్రీల కెట్టి కర్మ నాచరించుటకును అధికారములేదు. ఇంతే కాదు. ఆహారముకొఱకు పక్షిని జంపుటగూడ నిషిద్ధమే. ఆర్యమతమున సహధర్మిణి లేకున్న ధర్మకార్య మాచరింప వీలుపడదు.

ప్రాచీనకాలమున గృహస్థునకు పత్ని లేకున్న ఎట్టి ధర్మానుష్ఠానము నొనర్ప అధికారము లేకుండెను. ధర్మకార్యసమయమున పత్ని తప్పకుండ కూడనుండవలెను. అందువలననే పత్నికి మఱియొక పేరు సహధర్మిణి. ఆమెతో గూడియే ధర్మకార్యముల నాచరింపవలెను. హిందూగృహస్థునకు ఇన్నూరు రకముల ధర్మానుష్ఠానముల నొనర్పవలసియున్నది, కాని పత్ని కూడనుండి ఆ అనుష్ఠానముల తన కర్తవ్య అంశమును ఆచరింపనిచో ఎట్టి అనుష్ఠానము విధి అనుసారము అనుష్ఠితము లయ్యెడివి కావు.

ఆధునిక హిందూధర్మము పౌరాణికభావ బహుళము. అనగా దీని ఉత్పత్తికాలము బౌద్ధధర్మమునకు పరము. గార్హపత్యాగ్నియం దాహుతిదానమను వైదికక్రియ సహధర్మిణి లేకున్న జరుగదు. ఆమెయే మరల సాలగ్రామశిలను గాని, గృహదేవతను గాని స్పృశింప వీలులేదు అని దయానందసరస్వతి (వేలు పెట్టి) చూపించినాడు. దీనికి కారణము: ఈ క్రియ లన్నియు పౌరాణికయుగమున ప్రవర్తితములైనవి.

(సశేషము)

# వైధవ్యము - ధర్మశాస్త్రములు

•

శ్రీమతి కుడితిపూడి అచ్చమాంబగారు

•

భర్త గతించినంతమాత్రమున గుడ్డకు బొట్టునకు తిండికినిగూడ వారిని దూరముచేసి కేవలము జీవచ్ఛవములుగా వారిని జూచుట పాడిగాదు. సంఘమున నీయాచారములు అడుగంటి పోవలయును. వియోగమునకు సూచకముగ నొక్క మంగళసూత్రమును మాత్రము విసర్జించి సర్వాభరణములతో ఆహారనియమము లేక వారు వర్తించునట్లు ఏర్పాట్లు చేయవలయును. పసుపుకుంకుమలు కొంత వరకు పరిహరింపబడినను చుక్కబొట్టు అయినను యుండితీరవలయును. విధవ అనగా కన్యాస్వరూపమున నుండవలయునని నా ముఖ్యలక్ష్యము. కన్యకుకంటె వారికి నేవిధమగు వ్యత్యాసమును గాని అగౌరవమునుగాని ప్రదర్శింపరాదు.

ఏమి ప్రారబ్ధమో కాని సృష్టికలాపమంతయు స్త్రీ జాతికి ప్రతికూలముగ ప్రాణకంటకముగ పరిణమించినది. వారి విషయమున నొక్కరును కరుణించి హృదయవైశాల్యమును ప్రదర్శింపరు. సానుభూతిని ప్రకటింపరు. కడకు వారికి వాయుసేవనము స్వప్న ప్రాయమనిన నాడు ఇతర సౌభాగ్య సౌఖ్యముల తలపోయనేల?

కాని యీ యుగమున కొందరు మహాత్ములవతరించి వారి యవరోధముల బాపన ప్రయత్నించిరి. కాని, చిరకాలమునుండియు హృదయపంజరముల కరుడుగట్టుకపోయిన యవి యొక్కసారిగ కరగిపోజాలకపోయినవి. కాని వారి మహాందోళనమునకు ఫలితముగ సహగమనములు అంతరించినవి. పునర్వివాహములు అవతరించినవి. స్త్రీవిద్యా స్వాతంత్ర్యములకు ప్రచారము చిక్కినది. ఇతర సమస్యలపట్ల ప్రవేశము దక్కినది.

కాని యీ పరిమిత సంస్కరణదోహదముల మూలమున వారి జీవితముల మానవత్వము నెలకొనలేదు. వారి హృదయములకు సౌఖ్యానందములు కుదురుకొనలేదు. వారినింకను కొన్ని విషమ సమస్యలు పీల్చి పిప్పిచేసి జీవితాశను తెగద్రెంచుచున్నవి. అగాధపాతాళమునకు క్రుంగదీయుచున్నవి. వానిలో నొంటి రెంటిని వెలువరించిన, పుణ్యాత్ములు ఆలకించి కొలదిగనైనను అవరోధించుటకు ప్రయత్నింతురేమో యను యాశయే యీ వ్రాతకు హేతువు.

ప్రపంచమున నొకని కష్టసుఖములు మరొకనిపయి ఆధారపడియుండుట వారి నష్టములకు కష్టములకు మూలకందమగుటయే. ఇది యిరువురకు పరిసమానమైన వాడు తప్పదు గదా అని మనస్సునకు సమాధానము చెప్పుకొనవచ్చును. గాని ఇందలి కష్టనష్టముల నన్నిటి నొక్కవ్యక్తియే భరింపవలసివచ్చిన యీ పద్ధతిని సహించుట దుర్ఘటము అమానుషముగూడ. కాక సాంఘికాచార పాశములచే స్త్రీలను బంధించి పై పద్ధతులను వారి తలలపై దౌర్జన్యముగ రుద్దుట హృదయముగలవారు సహింపరానిది. మహాత్ములు అవశ్యము దాని నవరోధింపవలయునుగూడ. ప్రపంచమున నే ప్రాణియు తనసుఖము మరొకని మూలమున విలుప్తమగుటను సహింపదు. ప్రకృతియు నట్లు గానరాదు. కాని హృదయముగల మానవులందె ఇది గానవచ్చుట అతి విచిత్రము గదా. స్త్రీల కీ పరాధీన దుస్థితి తప్పిన గాని ప్రపంచమునకు యదార్థమగు కళ్యాణము సౌభాగ్యము ప్రాప్తింపనేరవు. రాజ్యాంగసమస్యలతో సంస్కరణములతో దానికెంత మెరుగులు పెట్టినను గాజుతళుకుబెళుకులకు తులికిపోవుట సరసమా?

స్త్రీపురుషుల జీవిత నవ్యానుభవములు పూచి ఫలించుటకు దాంపత్యము వసంతము వంటిది. అందలి ఫలితమును నిరువురు పరిసమానముగ ననుభవించుట న్యాయము ధర్మమునుగూడ. కాని మన సాంఘికాచార ప్రణాళిక దానికెంతయు విరుద్ధమై స్వార్థపరాయణమై స్త్రీల జీవితములను కసాయి కరుకుకోతలతో నులిమివైచినది; బూడిదచేసినది; నవరంధ్రములు మూసిబిగించి ఉక్కిరిబిక్కిరి గావించినది. స్త్రీలు తెగించి దీని త్రెంపి స్వాతంత్ర్యము జారగొందురేమో యను దుర్బుద్ధిచే పాపమను పరమాస్త్రమును ప్రయోగించినది. జ్ఞానవాసనాలేశముగూడ లేని కారణమున దాని తథ్యమని నమ్మి నరకపాతమునకు వెరచి స్వార్థమును స్వర్గవేదికకు బలిపెట్టిరి. నేటికినిగూడ ఆ యాచారములే హృదయ మూలములందు నాటుకొని కరుడు గట్టుకపోయినందున వానిని పెకలించుటదుర్భరమగుచున్నది. అది భరమును నాసయు పొడకట్టుటలేదు.

కాలవశమున భార్యగతించిన మరునాడె పురుషుడు నూత్నవధువునకు నుచ్చులుపన్న సాగును. భర్తగతించిన ఇక నా భార్యకు అతని నామస్మరణమున శుష్కోపవాసములు చేసి జీవితము ముగించుట కన్న వేరుసుఖములు సౌభాగ్యములు లేవు గదా? ఈ కానరాని చిచ్చు కాళిదాసు హృదయమున నెట్లు దాగినదో గాని పాపమతడు "నవ వైధవ్య మసహ్యవేదన" మని వాపోయినాడు. భార్యామరణమున భర్తకులేని వ్యథలు వేదనలు భర్తృమరణమున భార్యయేల అనుభవింపవలయును? అట్లనుభవింపవలయునని దేవుడు దిగివచ్చి ఎవరితోనైనను సెలవిచ్చిపోయెనా? ఇది పురుషుల స్వార్థము కాక అన్యమగుటకు అవకాశము గలదా? పురుషునివలె స్త్రీ రక్తమాంసములతో నరములతో హృదయముతో పుట్టలేదా? కాక పురుషునిసృష్టి ప్రత్యేకమా? స్త్రీపురుషులకే కాక ప్రపంచమున సకల జంతుజాలములకు ఆహారనిద్రాభయ మైథునములు సమానములై యున్న నాడు పురుషవియోగమున స్త్రీలు వాని నేల అనుభవింపకుండ నుండవలయును? ఇవి అత్యాచారములు కావా? ధర్మశాస్త్ర కర్తలకు వీనివలన స్వర్గగతులు తప్పవు కాబోలు. స్త్రీలు వైధవ్య ధర్మముల వారు సెలవిచ్చినవి విడిచిపెట్టినంతనె మీదు క్రిందై పోవునా? ఏమి స్వార్థము! భార్య గతించిన డెబ్బదియేండ్లవృద్ధునకుముక్కుపచ్చలారని ముద్దుగుమ్మలనంట కట్టుచున్నారు గదా? స్త్రీలు సాహసించి అట్టివానిని విరోధించుటకు సత్యాగ్రహములు పూనిన వారికి ధర్మశాస్త్రములు అడ్డువచ్చునా? స్వర్గమునుండి వారు ఎవరికైన దిగుమతి చేయుదురా? బాలవితంతువులకు పునర్వివాహముల నెల్లెడల ఆందోళన చేయగాచేయగా నంగీకరించిరి, కాని యదియు సర్వసామాన్యముగా నంగీకరింప

రయిరి. కాని యిప్పటి నా యీ వ్యాసమునకు నది మాత్రము లక్ష్యము కాదు. 'విధవలకు ఇంతటి అత్యాచారములగు ధర్మముల నంటకట్టనేల' అనునంతవరకే.

భర్త గతించినతోడనే నామెను వికృతాకారిణిం జేయుదురు. నగలు నాణెములు దొలగింతురు. పసుపు కుంకుమలు తగలనీయరు. రంగుకోకల తాకనీయరు. స్నానపానముల మాట తలపనీయరు. సౌఖ్యము వారి యెడ పెడమొగము తాల్చును. శుభములు వారి కనుల కప్పివేయును. ఆమె మొగమును జూచుటయే పాపమని యెంతురు. ఇంకను ఏవేవియో అత్యాచారముల నొనరింతురు. వాటి నన్నిటిని నిట పేర్కొననేల. భర్త గతించుటకు నామెను వికృతరూపిణి జేయుటకు సంబంధమేమి? భర్తృసంబంధమున నామెకు ప్రాప్తించిన దానిని తద్వియోగమున తొలగించుట వాదముకైన నుపయోగపడును. కాక సర్వనాశనముం జేయుట న్యాయమగునా? ఇంతటి సర్వనాశనమునకు మనధర్మశాస్త్రములుగూడ అంగీకరించుటలేదు. స్మృతి ముక్తాఫలమున శ్రాద్ధకాండ విధిలో భర్త మరణింపగా రజస్వలయగు నారి స్నానము చేసి మాత్రమును విసర్జించి శ్రాద్ధశేషమును ముగింపవలెనని మాత్రమే యున్నది. ప్రమాణశాస్త్రముగ నందరచే నంగీకరింపబడు మనుస్మృతియందును నంత ఘోరములగు ఆచారములు విధింపబడకపోవుటయే గాక అపుత్రవతియగు విధవయైనను స్త్రీ దేవరునివలన గాని, సపిండునివలన గాని కాక పుత్రుని బడయవచ్చుననియు, కొందరిమతమున నిరువురినిగూడ బడయవచ్చుననియు వచింపబడినది. ఈ మతమును నంగీకరించిన మనువు దృష్టిలో విధవకు వికృతాకారము సమ్మతము కాని యట్లు స్పష్టము గదా? కాని మనువేలనో ఇతరులకన్న విధవలపై కొంత కరుణ ప్రకటించినాడు. "పుష్ప మూలఫలములు వర్జ్యములు. పరుని పేరు తలపరాదు. ఆ జీవితము బ్రహ్మచర్యవ్రతము అనుష్ఠేయము. బ్రహ్మచర్యవ్రతనిష్ఠురాలు అపుత్రవతియైనను స్వర్గము తేరును" అని మాత్రమే మనువు వారికి ధర్మముల విధించినాడు. ఇందు కొంచెము పుష్ప మూలఫల విసర్జనముకంటె వికృతాకారము నాపాదించు ధర్మములు లేవు. పుష్పములు ధరింపకయు నందముగ నుండువారు లేరా? కాన మనువు విధించినవానిలో వారికి చిత్తశుద్ధిని గూర్చునవి లేవని నిర్ణయమగుచున్నది. ఇంతమాత్రమే కాక అతడు సంతానసౌభాగ్యవకాశములగూడ ప్రసాదించినాడు.

ఇక నిర్ణయసింధు, ధర్మసింధు కర్తలుమాత్రము తీక్ష్ణములు - ఘోరములగు ధర్మములను సరిసమానముగ వచించినారు. ఇరువురును తృతీయపరిచ్ఛేదమును వ్రాసియున్నారు. ఇరువుర ధర్మములను సంగ్రహించి చూపెదను. "కబరీబంధము పనికిరాదు. దానిని వపనము చేయవలయును. ఒంటిపూట భోజనము ఉపవాసములు చేయవలయును. పర్యంకమున పరుండరాదు. అంగోద్వర్తనములు వర్జ్యములు. గంధద్రవ్యముల నుపయోగింపరాదు. ప్రతిదినము భర్తకు తర్పణము లిచ్చుచుండవలయును. బండినెక్కగూడదు. కంచుకము ధరింపరాదు. వైశాఖ కార్తీక మాఘ మాసములందు విశేష నియమములతో నుండవలయును. తాంబూలము ముట్టరాదు. కంచుపాత్రమున అరగింపరాదు." ఈ ధర్మముల నిరువురు ఇంతవరకు సమానముగ చెప్పినారు కాని ధర్మసింధువు మరికొంచెము విశేషించి పలికినాడు. అదియుం జూతము—"విధవలకు రెండుధర్మములు ప్రతిపాదితములు. వైధవ్యపాలనము, సహగమనము. వైధవ్యమును సక్రమముగ పాలించిన స్త్రీ భర్తను మరల పొంది స్వర్గము ననుభవించును. శీలమును రక్షించుకొనవలయును. తద్భంగమున పతి స్వర్గమునుండి పాతాళమునకు గూలును. తలిదండ్రులు అన్నదమ్ములుగూడ స్వర్గదూరులగుదురు." ఈ విధముగ నీ యిరువురు విధవాధర్మముల నతికఠినముగ శాసించినారు. ఇంకను కొన్ని ధర్మశాస్త్రముల పరికించితిని గాని అందందును వీరి ప్రసక్తి

కానరాలేదు. విస్తరభీతిచే శ్లోకముల నుదాహరింపక భావమును మాత్రము సూచించితిని.

ఈ విషయమున ధర్మశాస్త్రములు కొన్ని సరసము గను మరికొన్ని అతిఘోరముగను వచించియున్నట్లు పైవాని మూలమున స్పష్టమయ్యెను గదా. నేటి కాల పరిస్థితులకు ధర్మములకు హస్తిమశకాంతరము. వానిని అవలంబించి ప్రవర్తించిన నేటితీరు మరొకవిధముగ పరిణమింపవలసియుండెడిది. కాన నీ విషయమునగూడ మనము ధర్మశాస్త్రముల మరచిపోయి వైధవ్యధర్మముల సంస్కరింపవలసిన సమయము ఎన్ని వత్సరముల క్రిందటనో రావలసియున్నది. కాని అది యింకను నేటివరకుగూడ సమాసన్నము కాలేదు. సంప్రాప్తించు సూచనలును గానరావు.

భర్త గతించినంతమాత్రమున గుడ్డకు బొట్టునకు తిండికినిగూడ వారిని దూరముచేసి కేవలము జీవచ్ఛవములుగా వారిని జూచుట పాడిగాదు. సంఘమున నీ దురాచారములు అడుగంటి పోవలయును. భర్తృవియోగమునకు సూచకముగ నొక్క మంగళసూత్రమును మాత్రము విసర్జించి సర్వాభరణములతో ఆహార నియమములేక వారు వర్తించునట్లు ఏర్పాట్లు చేయవలయును. పసుపుకుంకుమలు కొంతవరకు పరిహరింపబడినను చుక్కబొట్టు అయినను యుండితీరవలయును.

విధవ అనగా కన్యాస్వరూపమున నుండవలయునని నా ముఖ్యలక్ష్యము. కన్యకంటె వారికి నే విధమగు వ్యత్యాసమునుగాని అగౌరవమునుగాని ప్రదర్శింపరాదు.

తమజీవితమునకు పట్టుకొమ్మయు సర్వస్వమును నగు నాథునిమరణముతోడనే వారు కుళ్ళి కుమిలిపోవుచుందురు. దానికి తోడుగ నీ వికృతాకారము మరింతగ వారికడుపు బ్రద్దలుచేయును. ఆడువాండ్రు మిక్కిలిగ గుడ్డలకు నగలకు మురిసిపోవుచుందురు. వారికి వానిని దూరము గావించిన, యిక వారి దుఃఖమునకు పరిమితియుండదు. కనుక వికృతాకారపు నీ చేష్టలకు స్వస్తిచెప్పి, వారి దుఃఖమును పిసరంతయినను నీ రూపమును తొలగించి వారికి కన్యాస్వరూపమును ఆచారములో పెట్టుటకు నా సోదరీసోదరులను ప్రార్థించుచున్నాను. ఇందలి నా ఆశయములు విపరీతముగ నుండవచ్చును గాని యథార్థదృష్టి నరసించిన నవి సరసములుగనే పొడకట్టును. ఇంతమాత్రము చేత నే స్త్రీలకు సంపూర్ణముగ సౌఖ్య స్వాతంత్ర్యములు సంప్రాప్తించినట్లుగాదు. దానికి సర్వాంగ సంపూర్ణము పురుషునితో సరిసమానహక్కులు ప్రాప్తమయిన నాడె సిద్ధించును. దానికి లోకము నిరీక్షించుచుండవలయును. ఎప్పుడును ఇట్లే కాలము సాగిపోవునా ?





శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారు



గౌ॥ శ్రీమతి విజయలక్ష్మీ
పండిట్ గారు

ఢిల్లీలో జరిగిన అఖిలభారత మహిళా సభలో 'యుద్ధప్రతికూల తీర్మానాన్ని' ప్రతిపాదించి ఉజ్వలోపన్యాసం కావించారు. తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదింపబడింది.



శ్రీమతి వి. రాధామణిగారు

ఇటీవల జరిగిన మద్రాసు సంగీత పరిషత్సభలయందు తమ విద్యానైపుణిని ప్రదర్శించి బహుమతులు పొందియున్నారు. వీరికి గాత్రపాటయందు వీణవాయిద్యమునందు ప్రావీణ్యము గలదు.

# భ్రాంతి

శ్రీమతి
భాగవతుల లక్ష్మీనరసమ్మగారు

శ్రీ వెంకటేశ్వరస్వామి దర్శనం చేయాలని కోరికతో మంచి ముహూర్తమున పెద్దతిరుపతికి ప్రయాణమైనాము. క్రింద తిరుపతికి చేరేవరకు రాత్రి ఆరు గంటలైంది. అక్కడకు పైకొండ యెనిమిది మైళ్లు కలదని తెలిసినవాళ్లు చెప్పారు. రాత్రి రెండుగంటలకు క్రింద తిరుపతినుండి బయలుదేరాము. అర్ధరాత్రివేళ అయినా లైట్లవెలుతురువ ప్రయాణము సౌకర్యముగానేవుంది. మెట్ల రెండువైపులా వున్న ముష్టివాళ్లు అర్ధరాత్రివేళ అయినా వోపికతో వూరికే నడచువారిని 'వూరికే నడచివెడుతున్నారు. గోవిందా' అని, డోలీ యెక్కినవారిని 'డోలీ యెక్కి వెడుతున్నారు. గోవిందా' అని యాచిస్తున్నారు. మొదటికొండ గడచింది. రెండవకొండ యెక్కుతుంటే 'రెండవకొండ యెక్కుతున్నారు గోవిందా' అన్నారు ముష్టివాళ్లు. యీవిధంగా యెన్నవకొండ యెక్కుతుంటే అన్నవకొండ తెలుపుతు 'గోవిందా' అని అంటూండేవాళ్లు. కొండదిగుతూ మాకు యెదురువచ్చేవాళ్లు కూడా గోవిందా గోవిందా అంటూ దిగుతున్నారు. యీ గోవిందనామ స్మరణలను వింటూ యేడు కొండలు యెక్కాము. అప్పటికి వుదయం యెనిమిది గంటలైంది. మైసూరు మహారాజు సత్రమున భోజనము పెడతారని తెలిసి అక్కడకు వెళ్లి చీటి తెచ్చుకొన్నాము. పన్నెండు గంటలకు భోజనమునకు రమ్మని సత్రాధికారి చెప్పాడు. యీలోపల స్వామిదర్శనం చేసివద్దామని ఆలయములోకి వెళ్లాము. అక్కడ మావలె ధర్శనార్థమై వచ్చినవాళ్లందరు ప్రక్కనున్న ద్వారం నిరీక్షిస్తున్నారు 'ధర్మ దర్శనం లేదు' అని గేటుకు అట్టపై వ్రాసికట్టారు. అక్కడ వొక డవాలిబంట్రోతు కాపలావున్నాడు. పన్నెండు గంటలకు వొకసారి మాత్రం ధర్మదర్శనం గలదన్నారు. విలువలేని భక్తి ధనమును వెచ్చించి చూడవలసిన భగవంతుని వ్యావహారికధనమును వెచ్చించి చూచుట నా కిష్టములేదు. పన్నెండు గంటలకే భోజనమునకు రమ్మని సత్రాధికారి చెప్పినా భగవంతుని మీద భారంవేసి ధర్మ దర్శనానికే నిరీక్షించాము. ఆవేళ అయ్యేవరకు పశువులను తోలినమోస్తరుగా వొకదారినుంచి లోపలకు తోలి మరివక దారినుంచి యివతలకు తోలారు. స్వామి దర్శనం అయింది. మేము భోజనమునకు సమయానికే వెళ్లాము. సాయంకాలం మూడుగంటల వేళకు వుత్సవులను ప్రాకారములోకి తీసుకువచ్చి వుత్సవము జరిపి ప్రసాదములు పెడతారని తెలిసి వెళ్లాము. వుత్సవము జరిగిన తరువాత ప్రసాదముల సమయమైంది. ప్రసాదములు తెస్తారు, కదలకుండా గల్లంతులేకుండా కూర్చోండని అర్చకులు చెప్పారు. అందరు కదలకుండా భగవంతునియందు భక్తితో ప్రసాదము

స్వీకరిద్దామను ఆశతో కూర్చున్నారు. వెంక స్వామి ప్రసాదములు చేతపుచ్చుకొనివచ్చి అక్కడ పరిచారకులుగావున్న స్వాములకు వారి ఆడవారికి పెట్టి లోపలకు వెళ్లిపోయాడు. తరువాత దేమునికూడా లోపలకు తీసుకువెళ్లారు. సాయంకాలము ప్రసాదములు అమ్మకారని తెలిసి కొనుక్కొందామని ఆలయములోకి వెళ్లాము. అమ్మె స్వామిని పొంగలి చూపమన్నాము. వేడి వేడి పొంగలి అతి రుచిగలది మచ్చు చూపాడు. మాకు కావలసినన్ని పొంగలి ముద్దలు ఖరీదువేసి తీసుకొన్నాము. మంచి నీళ్లను దగ్గరపెట్టుకొని తినుటకై కూర్చున్నాము. ఆముద్ద విప్పవరకు నాల్గురోజుల క్రిందచేసిన ప్రసాదము, పాసినకూడు. మనకు చూపిన ప్రసాదము మంచిదేకదానని ముద్ద పరిశీలిస్తే మంచిప్రసాదము పూసినట్లు కనుపడినది. దానిని గుడిలోకి తీసుకువెళ్లి పారా జవానులకు చూపి యిదియేమి అన్యాయమని అడిగాము. 'యిది పావస్తలము' అని బదులు చెప్పాడు. ఉత్తర రామాయణములో వున్న కుక్క కథా వృత్తాంతము యీదేవస్థాన ముఖమున జ్ఞాపకమొచ్చి యీ కాలములో శునక వృద్ధి విశేషముగా నుండుటకు యీ దేవస్థానములే కారణములని తలచుకొని యిక ఆసమయమున ఆకలి తీరుటకు యేవిధము గను పడక ఆరాత్రి క్షేత్ర వుపవాసముచేసి మహారాజా సత్రమున పడుకొన్నాము. రాత్రి పదిగంటలకు జనము తిరిగి తిరిగివచ్చి సత్రమంతా నిండుగా పడుకొన్నారు. శుభ్రమైన దీపములు వెలగించారు. పదకొండు గంటలు అయేవరకు పడుకొన్నవారిలో చాలామంది వీధిలోకి నడిచారు. మావాళ్లు శ్రమపడి వచ్చుటచేత కాబోలు మసులుతూనే పడుకొన్నారు లేవలేక. నేనుమాత్రము నిద్ర సౌకర్యములేకపోతే భరించలేను. ఆ సత్రములోవున్న ఘడియారము పదకొండు గంటల మొదలు తెల్లవారుఝామున నాలుగు గంటలు కొట్టేవరకు కూచొని మావాళ్ల పక్కలలోవున్న కొండ నల్లులను కోటియజ్ఞము చేశాను. సత్రములోవాళ్లు లేచివెళ్లుటకుకూడా కారణము యిదే అనుకొన్నాను. మైసూరు మహారాజుకు యీ సత్రమునగల నల్లులబాధ తెలిసివుండదని వూహించాను.

తెలిసినట్లైతే నిద్రాహారములని కదా వాడుక. ఆహార సౌకర్యమును చూచిన వాకు నిద్ర సౌకర్యమేల చూడడని తలుస్తూ ఆలోచిస్తుండగానే ఘడియారము నాలుగు కొట్టింది. జనులందరు పాపనాశనమునకు ప్రయాణమౌతున్నారు. మేముకూడా లేచి ప్రయాణమైనాము. షుమారు నాలుగుమైళ్లు గల పాపనాశనమునకు నెమ్మదిగా చేరుకున్నాము. అక్కడ ఆకొండ ధారలను చూచేవరకు అపరిమితమైన ఆనందమైంది. స్నానమునకు టిక్కెట్టు పెడతారేమో అనుకొన్నాను. అది జరుగలేదు. యెవరియందు భక్తితో దర్శనాతురులమై వచ్చామో ఆ దేవుని దర్శనము తృప్తిగా చేయలేక పోయి

నామనసు హృదయ తాపము నివారించునట్లు పాపనాశనమున తృప్తిగా స్నానమాడాము. అక్కడినుంచి ఆకాశ గంగలో స్నానమాడి నెమ్మదిగా మైసూరు మహారాజు సత్రము నకు చేరేవరకు భోజనము వేళ అయినది. పడిన ప్రయాసకు విశ్రాంతినిచ్చు భోజన మును సత్రమునచేసి క్రిందకు వెళ్లదలచి స్వామిదర్శన మగునేమోయను ఆశతో మరి వకసారి ఆలయములోకి వెళ్లాము. సమ యము గడిచిపోయినది కాబోలు ధర్మ దర్శనం లేదు అని కట్టివున్నది. దేశములో యున్న దేవాలయములు గలవుగాని యెదురు ద్వారము లేకుండా ప్రక్కద్వారం పెట్టినవి యెక్కడా కనుపడవు. యెవ్వరు దేవాలయ మునకు యెదురు ద్వారమే చూస్తున్నాము. యిది దేముని పేరుతో జరుగు వ్యాపారా లయముగాన ద్వారం తెరచిన వెంటనే స్వామి దర్శనమగునేమో వ్యాపారమునకు భంగము గలుగునని ప్రక్క ద్వారము పెట్టారు. స్వామి గర్భగుడికి యెదురుగా కొంతదూరములో ముఖ మంటపమునకు గోడవొకటి వున్నది. ఆకిటికీలోంచి స్వామిని చూడకలనేమోయని వెడితే చీమదూరు సందుకూడా లేకుండా మూశారు. వేలకు వేలమంది జనము వందలకు వందల రూపా యిలు ఖర్చుచేసుకొని దర్శనాతురులై రావటము; వస్తు ప్రదర్శనశాలవలె టిక్కెట్టు కొనుక్కొంటేనేగాని స్వామి దర్శనం కాక పోవడం. వొకవేళ కొనుక్కొన్నా యింకో పర్యాయము చూడాలనివుంటే మళ్లీ కొను క్కొనవలసిందే. అంత పేరుపడ్డ యేడు యేడుకొండల స్వామి ప్రసన్నత లేకుండా సెంటరుజైలు వాసము చేస్తున్నాడు. తిరిగి సత్రమునకు వచ్చి కూర్చొనగా యీవిధ మైన ఆలోచన కలిగింది. కొండ యెక్కుట ప్రారంభించగానే ముష్టివాళ్లు రెండవకొండ యెక్కుతున్నారు గోవిందా మూడవకొండ యెక్కుతున్నారు గోవిందా అని చెప్పనే చెప్పారు. యెదురుపడ్డవాళ్లు తెలపనే తెలి పారు గోవిందా అని.

ఆ గోవింద పదమును మొదట అర్థం చేసుకోలేక పోయాము. అక్కడకు వెళ్లిన మీదట దర్శనం ప్రసాదం మీరు ఆసిస్తే గోవిందా అని ముష్టివాళ్లు చెప్పారు. యేడు కొండలు యెక్కి దిగుచుండుటచే శక్తి గోవిందా, దూరదేశములనుండి వచ్చుటచే సొమ్ము గోవిందా, మ్రొక్కుని తీర్చుటచే జుట్టు గోవిందా, అన్ని గోవింద చేసుకొని ఆసించిన దర్శన ప్రసాదములు గోవిందా అని యెదురుపడ్డవాళ్లు తెలిపారని అను భవంలో అర్థం చేసుకొని, శ్రీ వెంకటాచల క్షేత్రమున దేముడు గలడా? రూపముగల దేముడా? అంతర్యామి అయిన రూపములేని దేముడా? అని ఆలోచనగలిగింది. నామనస్సు యీవిధంగా స్థిరంచేసింది.

వస్తు ప్రదర్శనశాలా వ్యాపారమందు వలెనే భగవంతుడని పేరుపెట్టుకొన్న వెంక టేశ్వర శాలా వ్యాపారమునకూడా భక్తితో పనిలేక ధనమునుగూర్చు యుక్తే ప్రధాన ముగా గలిగి భగవంతుడు పృధ్విరూపమున

కఠినాంశను పొంది అంతర్యామి అయి వున్నాడు.

పాపనాశనమున కరుగు జనుల హృదయ తాపము నివారించు ప్రతిఫలరహితమైన ప్రసన్నతను చూపుచు భగవంతుడు జలరూపమున ద్రవాంశనుపొంది అంతర్యామి అయివున్నాడు.

ఎంతెంతో దూరదేశమునుండి వచ్చు వేడు కొండలెక్కిన జనసముదాయము యొక్క శ్రమను ఆదరణయుక్తముగా తీర్చు చున్న మైసూరు మహారాజా సత్రమున భగవంతుడు ప్రకాశరూపమున తేజాంశనుపొంది అంతర్యామి అయివున్నాడు.

నిష్కళంకమైన భక్తితో నిలువుదోపుల నిచ్చినను ఆలయమునగల భగవంతుని పుచితముగా పునర్దర్శన లాభము పొందలేకున్నను ఆ భగవంతునియందు విరక్తి చెందలేని భక్తుల సౌమనస్యమున భగవంతుడు వాయురూపమున సంపూర్ణాంశనుపొంది అంతర్యామి అయివున్నాడు.

పెద్ద తిరుపతి వెంకటేశ్వరస్వామి, ఏడు కొండలవాడు, వడ్డికాసులవాడు అని అన్ని దిక్కులా వ్యాపించి భగవంతుడు ఆకాశరూపమున అవకాశాంశను పొంది అంతర్యామి అయివున్నాడు.

యీవిధముగా పంచభూతములయందు అంతర్యామి అయి వ్యాపించిన రూపము లేని దేముని రూపముగల దేముడనుకొనుట భ్రాంతి.

## ఆంధ్ర కవితాకుమారి ✓

శ్రీ ఉభయభాషాప్రవీణ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు

రాజరాజ నరేంద్రు రతనాలమేడలో బసిడిగిన్నెల నుగ్గుబాలు ద్రాగి
సోమయాజులవారి హోమంపు ముగ్గు ముంగిళ్లలో ద్రొక్కుడు బిళ్లలాడి
సిసలైన శ్రీనాథు సీస పద్యాలలో తూగుటుయ్యాలల నూగి యూగి
భాగవతులవారి పంచపాళీలలో బత్తి శయ్యలమీద నొత్తిగిల్లి
విజయ విద్యానగర రాజ వీథులందు
దిగ్గజంబులమీదనే తిరిగి తిరిగి
కంచు జయభేరి దెసల మ్రోగించినట్టి
ఆంధ్ర కవితాకుమారి ! జోహారునీకు.

# • కుంకం బొట్టు •

శ్రీమతి నవుడూరు వెంకటరమణగారు

చిన్నప్పుడే తల్లీ తండ్రీ పోయినప్పటికి వాళ్ళమ్మమ్మ రామాన్ని తీరదీసి పెంచి పెద్దవాణ్ణి చేసింది. బి.ఏ. దాకా చదువు చెప్పించి వాళ్ళదగ్గరపిల్లనే జానకి నిచ్చి పెండ్లిచేసింది. ఓ యేడాది బాధపడ్డప్పటికీ ఏలాగయితేనేం రామం ఒక యాభై రూపాయల ఉద్యోగము సంపాదించాడు. ఏదో ఒకలాగు సంసారం గడిచిపోతోంది.

జానకి చాల తెలివైనపిల్ల. కాస్త చదువుకున్నది; బుద్ధిమంతురాలు. మొగుడుదగ్గర అవ్వదగ్గర వినయ విధేయతతో ప్రవర్తించేది. అసలు ముద్దుగా పెరిగింది. చిన్నప్పటినుంచి రామాన్ని తెలుసును. అప్పుడప్పుడు చిన్నప్పుడు రామం సెలవులకి వాళ్ళ వూరు వస్తే అతనితో షికార్లకి సినీమాలకి వెళుతూవుండేది. ఇంటిదగ్గర గవ్వలాట, పేకాట, క్యారమ్సు ఆడేది. అందుచేత పెండ్లి అయాక కూడ రామందగ్గర అతి చనువుగా ముద్దుగా వుండేది. చిలకాగోరింకల్లాగ చక్కగా కాపురం చేస్తున్నారు. రామం శిక్షణవల్ల నయితేనేం, అతను ధనంమీద నైతేనేం జానకి మొగుడుకి యేమాత్రం చికాకు కల్గించకుండా ఎప్పుడూ వుల్లాసం కలిగిస్తూ వుండేది. ఏ పనిచేసినా ఏ మాట అన్నా అది ఇతరుల వాళ్లకి, అందులో ముఖ్యంగా తన మొగుడికి కష్టంగాను, అయిష్టంగాను లేకుండా చూసుకుని ప్రవర్తించేది. అవ్వగారి శిక్షణవల్ల కుట్టు, శుభ్రత, మడి, ఆచారము, దైవభక్తి యివన్నీ అలవడ్డాయి. అంటే పరమపతివ్రతల కుండవలసిన సుగుణాలన్నీ జానకి పదహారేళ్లు నిండేసరికి నేర్చుకుంది.

జానకి కాపరానికివచ్చి ఒకయేడాదిమాత్రమే అయినప్పటికి అవ్వగారు మాత్రం జానకి కింకా నెల తప్పలేదని విచారిస్తోంది. అప్పుడే చాలకో జబ్బించి 'రామం! నీ కడుపున నో కాయ కాస్తే చూశావనందిరా. అప్పటికిగాని నా ప్రాణం పోదురా' అని పోరుతోంది. రామంచేత జానకిచేత తిరపతి వస్తామని మొక్కించింది. ఆడపిల్లయినా మగపిల్లయినా పేరెట్టిస్తామంది. జానకిచేత ఎన్నోనోములు వ్రతాలు చేయించింది. ఆఖరికి ఎలాగయితేనేం దేవుణ్ణి మెప్పించింది. జానకి యీసారి నెల తప్పింది. ఇంక ముసలావిడ సంతోషానికి పట్టపగ్గాలు లేవు. యిదివరకే ఏ పనీ చేయనిచ్చేది కాదు. ఇప్పుడు మరీ గారాబంగా చూస్తోంది. రామానికి జానకంటే అమితమైనప్రేమ. విధిలేక ఆ నాలుగంటలు ఎలాగో ఆఫీసులో గడపి నిత్యం జానకిదగ్గర కూర్చునేవాడు. అనేక మాసపత్రికలు తెచ్చి ఆమెచేత చదివిస్తూ తానూ వింటూవుండేవాడు. ఆమెకి చదరంగం, క్యారమ్సు, పేకాట నేర్పి, తనూ ఆమె ఆడుకుంటూ కాలం గడిపేసేవారు హాయిగా. ఇంటికొచ్చి 'జానకీ!' అని పిలుస్తే వెంటనే ఆమె రావాలి. అంతే! లేకపోతే వెర్రెత్తిపోయి కొంపైనా విప్పకుండా ఇల్లంతా వెతికేసేవాడు.

ఇంతలో జానకికి ఏడోనెలవచ్చింది. వాళ్లవాళ్లు తీసుకుని వెళ్లిపోయారు. ఒకరినొకరు వదల్లేక జానకి రామంలు ఎక్కువ శ్రమపడ్డారు. కాని వారానికో వుత్తరం రాయటానికి వప్పుకొని విడిపోయారు విధి లేక. ఇలా కాలం జరిగిపోతూంది. క్రమంగా జానకికి నెలలు నిండాయి. మంచినక్షత్రాన్ని కొడుకుని కన్నది. శుభప్రదంగా బాలసారె మహోత్సవం జరిగింది. సెలవు లేనందున వెంటనే తిరిగివెళ్లి పోవచ్చాడు. జానకిని మూడోనెల్లో పంపిస్తామన్నారు వాళ్లవాళ్లు. వారానికో వుత్తరంమాత్రం తప్పకుండా నడచిపోతూంది క్రమము తప్పకుండా.

మూడోనెల ప్రవేశించాక మంచిరోజు చూసి ఆ నాటికి స్టేషనుకి రమ్మని వ్రాశారు రామానికి. ఆవిధం గానే రామం సరిగా రైలువేళకి వెళ్లి జాగ్రత్తగా జానకిని పిల్లదీని యింటికి తీసుకువచ్చాడు. వెంటనే బజారుకిపోయి కావలసిన సామగ్రి పట్టుకొచ్చాడు. ఆ వేళకి సెలవుపెట్టి ఇంటిదగ్గర కులాసాగా జానకితో కబుర్లు చెప్పుకుంటూ కాలము గడిపేశాడు హాయిగా.

అదృష్టవశాత్తు రామానికి చిన్నప్పటినించి పుట్టి పెరిగిన వూళ్లోనే వుద్యోగం దొరకటంచేత అతనికి అనేకమంది స్నేహితు లుండేవారు. అందుచేత రామానికి యిన్నాళ్లు జానకిదగ్గర లేకపోయినా, ఎలాగో ఒకలాగు కులాసాగానే గడిపేయగలిగాడు. అతని స్నేహితులందరిలోనూ ముఖ్యుడు శాస్త్రి. రామం శాస్త్రి ఒకరినొకరు విడిచేవారుకారు. ఎవళ్లోఒకళ్లు రెండోవాళ్ల యింటికి వెళ్లడం, తరవాత వాళ్లిద్దరూ కలిసి సాయంత్రం వీధికి వెళ్లటం, మిగతా స్నేహితులతో కలిసి ఏ పేకాటో, బాతాఖానీయో చేయటం, రాత్రి ఏడున్నరకి యింటికి చేరటం మామూలు. శాస్త్రి రామానికి కాస్తంత దూరపుబంధువుకూడాఅవటంవల్ల తరచు రామంయింటికి వచ్చేటప్పుడు అరమరలేకుండ జానకితోటీ అవ్వగారితోటీకూడా బాతాఖానీ చేసేవాడు. అసలు శాస్త్రి మంచిమాటకారి. అతి చలోక్తిగా మాట్లాడి అందరిని నవ్విస్తూండడం అతని అలవాటు. తనవాళ్లుగాని, యితరులుగాని యెంత విచారంగా వున్నప్పటికీ తనమాటలచేత ఖుషాలా పుచ్చేవాడు. తనని ఒకరో మాటన్నప్పటికీ, దాని కేదో హాస్యార్థము తీసి నవ్వేసేవాడు. తను నొచ్చుకోడు. ఇతరులను నొచ్చుకోనివ్వడు. రామం, అమ్మమ్మ 'ఏమిరా శాస్త్రి నీకు పెళ్ళెప్పుడురా' అంటే 'పెళ్లి లేకపోతే బతకలేమటండీ' అనేవాడు.

రోజూ అలవాటుప్రకారం జానకి వచ్చినరోజున కూడ రామం తెల్లపంచ, తెల్లనిచొక్కా, బూటు వేసుకొని షైరు పోవడానికి వీధిగుమ్మంలోకి వచ్చి నిలుచున్నాడు. కాని ఏదో మరిచిపోయినట్టుండి ఓ సారి లోపలికివెళ్లి మళ్లీవచ్చేశాడు. వెనకాలే జానకి వస్తూ 'రోజూ లాగకాక యివాళ పెందరాడే రాండేం' అంది బుగ్గతుడుచుకుంటూ. 'అలాగే తలుపేసుకో' అని వెళ్లిపోయాడు రామం శాస్త్రి యింటికి. శాస్త్రి అప్పుడే టాయిలెట్టయి సిద్ధంగా నిలుచున్నాడు. అప్పుడు ఇద్దరుకలిసి 'పాలఘాట్'లో కాఫీతీసుకుని బయలుదేరారు బీచికి.

శాస్త్రి, రామం, శర్మ, రావు యిత్యాదులంతా సమావేశమయారు సముద్రపొడ్డున. బాతాఖానీ చాలా ఘాటుగా సాగిపోతూంది ఆ వూళ్లో అన్ని విషయాలగురించి. ఆ వూరు మునసబుగారిని ఓ ప్లీడరు గారు ఎదిరించి మాట్లాడటం, తరవాత వాళ్లిద్దరి చర్చ హైకోర్టువరకు వెళ్లటం మొదలు వాళ్ల మునిసిపాలిటీ హెల్తు యినస్పెక్టరు చప్పిడి రామిని మోహించటం వరకు గల యావత్తువిషయాలు దొర్లిపోతూన్నాయి వాళ బాతాఖానీలో. డాక్టరు సుబ్బరాయనుగారిబిల్లు, ఋణవిమోచనచట్టము, ఆంధ్రరాష్ట్రముగురించి మొదలైన రాజకీయవిషయాలు, హిట్లరు ముసోలినీ వాళ్ల వాళ్ల ప్లానులు, ఒకటేమిటి అన్నిటిని చర్చించి పారేస్తున్నారు. వార్ధాస్కీము బాగుంటుందంటాడు మ్యాథ్సు మాస్టరు రావు. గాంధీగారి శాంతిసమరానికి యిది టైము కాదంటాడు శర్మ. ఈవిధంగా ఎవళ్లకితోచిన విమర్శనవాళ్లు యిష్టమున్న విషయాలమీద సాగిస్తున్నారు.

ఇంతసేపు చాలా పరధ్యాన్నంగా వున్న శాస్త్రి ఒకసారి సగకాయించి రామం కేసి చూపిస్తూ రావుకి సైటు కొట్టాడు. రావుకూడ చాలా తదేకదీక్షగా రామం కేసి చూసి శాస్త్రి తనూ నవ్వుకున్నారు. రామం యీ సంగతి యేమీ కనిపెట్టలేదు. సంభాషణలో కాస్త అవకాశం చిక్కగానే శాస్త్రి రామాన్ని తట్టి:

'రామం ! వది ఎప్పుడొచ్చిందిరా' అన్నాడు.

'ఓహో ! అదా సంగతి. అందుకే చాలా పర ధ్యాన్నంగా వున్నావీ వేళ' అన్నాడు రావు.

రామం ఆశ్చర్యపోయాడు. ఆ వేళ పదకొండు గంటలకొచ్చిన జానకి సంగతి శాస్త్రి కెలా తెలిసిందా అని. తాను స్టేషనుకి వెళ్లినప్పుడుగాని, తిరిగి వాళ్లని ఇంటిలో దిక్కని వచ్చినప్పుడుగాని, శాస్త్రిగాని, మరే యితర స్నేహితులుగాని చూడలేదు. అసలది వాళ్లెవళ్లు స్టైని తిరగవలసిన టయిముకాదు. పోనీ శాస్త్రి ఆ వేళ మధ్యాహ్నం వాళ్లింటికి వచ్చాడేమో నంటే, అదీలేదు. తనా విషయంగురించి అతనితో చర్చించలేదు. అంతా అయోమయంగా వుంది. జానకి వచ్చినట్లు ఎలాగు తెలిసింది. శాస్త్రినిగాని జానకినిగాని అనుమానించరాదు; అందుకూ అవకాశం చాలటంలేదు. ఇక వక్కడ వుండబుట్టింది కాదతనికి. వెంటనే యింటికి బయలుదేరాడు 'ఒరే! తలనొప్పిగా వుందిరా యింటికి పోతానురా' అని చెప్పి.

'అరే ! అప్పుడే పోతావా, ఇంకా పేకాటవేద్దామని చూస్తున్నా'మన్నారు శర్మ యిత్యాదులు.

'ఇవాళే నా పోనీండ్రా' అన్నాడు రావు.

'సారీ బ్రదర్ ! తలనొప్పిగా వుందిరా' అని చెప్పి బయలుదేరిపోయాడు. ఎలాగో వాళ్లని ఒదుల్చుకొని తిన్నగా యింటిముఖం పట్టాడు.

రామం దారిపొడుగునా సాయంత్రం జరిగిన ట్రాజెడీనిగురించి ఆలోచించ మొదలుపెట్టాడు. అతని బుర్రలో రైళ్లు పరుగెడుతున్నాయి. ఎంతాలోచించినా, ఏ విధంగాను నిర్ధారణచేయటానికి వీలు కాకుండా వుంది. యీ చిక్కుకు కారణం ఎవరయి వుంటారు? జానకా, శాస్త్రియా? లేక తన తెలివి తక్కువా? తన్నంత ప్రేమిస్తూన్న, తానంతలా ప్రేమిస్తున్న జానకిని అనుమానించవచ్చునా, లేక శాస్త్రి వల్ల తప్పేమయినావుందా? వాడి కెలా తెలిసింది జానకి ఆ వేళ వచ్చినట్లు. తనని ప్రాణసమానంగా ప్రేమిస్తాడే శాస్త్రి. తనకోసం ఏం చేసేయమన్నా చేసేస్తాడే, బావిలో దూకమన్నా దూకేటంతటి ప్రాణ స్నేహితుడు గదా శాస్త్రి తన్నలా మోసంచేస్తాడా? తిన్నయింటి వాసాలు లెక్కపెట్టేటంతటి మూర్ఖుడు కాడే. తన్నంతలా నమ్ముతున్న శాస్త్రి జానకి తన్ను మోసంచేస్తే, యింకేమిటి ప్రపంచం? కంచెయే చేను మేసిన ! లేద దిక్కు——నాకెవ్వ ! యేమిటో పిచ్చి వూహాలు. జానకి శాస్త్రికూడ అనుమానించవలసిన మనుషులుకారు. ఛీ ! శాస్త్రి వూరికే అలా అని వుంటాడు.........శాస్త్రిగాడు తనని మోసం చేస్తాడా? శాస్త్రి తనని మోసంచేస్తే జానకికూడ దోషియే కదా. జానకిని అనుమానించవలసిందేనా?... యేమో శ్రీ లెంకయినా పాపానులు. ఏమీ పాలు పోకుండా వుంది రామానికి.

ఎలాగై తేనేం యిల్లు చేరుకున్నాడు. అతి చిరాకుతో కోటైనా విప్పకుండా చతికిలపడ్డాడు కుర్చీలో. వెర్రివాడిలా తల తడుముకుంటూ ఆలోచన చేసేస్తున్నాడు. ఇంతలో వుగ్గుపడుతూంటే కాబోలు చంటి పిల్లది యేడుపు వినిపించింది. రామానికి చైతన్యం వచ్చింది. తిరిగి యీ ప్రపంచంలోకి వచ్చాడు. అంత వరకు జరిగినకథంతా శాస్త్రిగాడి వెంకితనం అని జానకికి చెప్పితే అది గాథరాపడుతుంది. ఎంతమాత్రం ఆ విడికి చెప్పకూడదని నిర్ధారణచేసుకుని 'జానకీ !' అని గట్టిగా పిలిచాడు. జానకివచ్చి 'ఏమండీ అప్పుడే వచ్చేశారు' అంటూ కోటు విప్పడానికి కూర్చుంది. అయిపోయాక రామం ముఖంలోకి చూస్తూ 'అలా వున్నా రేమండీ' అంది. మరికొంచెంసేపు నిదానించి చూసి ఆశ్చర్యంతో నిలబడి యిలా అంది.

'ఏమండీ, యిన్నాళ్లు యిదా చేస్తున్నారు. మీ కిది బాగుండా నన్నిలా అన్యాయం చేస్తారా? అందుకా నేను పిల్లది అయిదో నెల్లో వస్తానంటే నీ

'యిష్టం వచ్చినట్టు చెయ్యి'అన్నారు. అడ్డమయిన ముండలికిపోయి సంసారం పాడుచేస్తారా?' అంటూ రోదుపు ప్రారంభించింది.

రామం గుమ్మెబోయాడు. ఇది మరో ట్రాజడీ ఇదేమిట్రా బాబు ఇలా అంటోంది అనుకున్నాడు. 'అదేమిటి జానకి నీకేం చేశాను. నా వల్ల దోషం ఎంతమాత్రం లేదు. నేను నిన్ను తప్ప మరియే యితర స్త్రీని కన్నెత్తి చూడలేదు. ఎందుకు కలిగిందీ అనుమానం నీకు' అన్నాడు.

జానకి అతని వక్షస్థలంపైపు చూపిస్తూ 'అదేమిటండి, ఆకుంకం మీరూనూ ఎక్కడంటించుకున్నారండి. మీ కిది ధర్మంగా వుందండి. మీరే నన్నిలా అన్యాయం చేస్తే నాకేదండి దిక్కు యింక !' అని రాగం తీసింది. ఆశ్చర్యంతో చూచుకున్నాడు రామం తనగుండెలమీదికి. ఎర్రగా కుంకంబొట్టొకటి తెల్లని చొక్కామీద స్పష్టంగా అగపడుతోంది.

ఇప్పుడు బోధపడింది రామానికి శాస్త్రిగారన్న మాటల కర్థం. చిన్నచవ్వు నవ్వి జానకిని దగ్గరకు తీసుకుని ఆమె శిరస్సు గుండెల కదుముకుని ముద్దుపెట్టుకుని 'జానకీ యిప్పుడు చూడు' అన్నాడు. అదే స్థలంలో ఇంకొంచెం కుంకం అంటుకుంది. 'ఇప్పుడు తెలిసిందా' అన్నాడు రామం. 'అదా సంగతి. ఇందాక మీరు సైకిలు జనులుచేరి వీధిలోకెల్లిపోయి కూడ తిరిగివచ్చి...' అంది సిగ్గుతో.

ఇంతలో ముగ్గు అదీ పోసి తీసుకొచ్చింది చంటి పుత్రవాణ్ణి అవ్వగారు.

# ఉద్బోధము

శ్రీమతి టి. రామాప్పమ్మగారు

శుభములలవడు దురితముల్ సోలిపోవు
చింత నిర్మూలమగు సిరిచెంత జేరు
మనసు కుత్సాహమమితమై, మహిని వెలయు
శీల వృత్తములలవడ జేయువిద్య
ఆడుబిడ్డల చదివింపు డన్నలార!

సకల వాంచితములఁ దీర్ప జాలునట్టి
కలుషముల బాపుమార్గంబుఁ గరపునట్టి
విద్యసాటికి పుడమిలో వేరె గలదె
ఆడుబిడ్డల చదివింపు డన్నలార!

అవనిలో సతులెందరల్లి కబ్బములచే
విఖ్యాతులై భువి వెలయలేదు
పూబోఁడు లెందరఁద్భుతమొంద బతులకు
సగతుర గెలువ, తోడ్పడగలేదు

సంగీత సాహిత్య సత్కళా కుశలులై
యెందరు బిరుదులు పొందలేదు
మత ధర్మములు దెలిసి పతులకు బోధించి
మగువ లెందరు భువిలోన మనగలేదు

పొసగిమా మోమున, నేఁపొద్దు బొడచనేమొ
తొల్లి తల్లుల చదువులు కల్లలేమొ
ఇంటి కల్పక మీరీతి యుండదగునే
ఆడుబిడ్డల చదివింపు డన్నలార!

ఘోషయుంచుచు మగువల ఘోషపెట్టి
వేష భావల వనితల వెలిని వేసి
యేమిగట్టుకు పోయెదో వెఱ్ఱియన్న
కుళ్లు బోగొట్టుకొనుచు హృద్గోళమందు
ఆడుబిడ్డల చదివింపు డన్నలార!




# ఉచితము!

నూతనశక్తిని, పుష్టినిచ్చే
ఈ పానీయాహారము
బోరన్ విట
పెద్దసైజుటిన్ను ఉచితము.

స్పోర్ట్సుమెన్ సిఫార్సు చేసిన ఆరోగ్య పానీయము

'అద్భుతంగా పనిచేస్తుంది' సన్మతవర్థు.

'బోర్నవిట బాలలకు శక్తి ... చైతన్యం చేసింది' — రూపసింగ్.

'శక్తి బలానికి అద్భుతమైనది' ముస్తాఖాలీ.

ఆరోగ్యప్రదమని ప్రపంచ ప్రసిద్ధిచెందిన దీన్ని మీరెలా ఉచితంగా సంపాదించగలరో చదవండి!

శారీరక మానసిక బలాభివృద్ధికి కావలసినవాటి నన్నిటినీ ఇచ్చేది బోర్నవిట ఒకటే. ఇది అందరికి కావలసిందే. దీన్ని నీమిత్రులకు సిఫార్సుచేస్తే పెద్దసైజు టిన్ను నీకు ఉచితం. మాల్టు, పాలు, ప్రోటీనులు, లాక్టోస్, ఎ. బి. డి. విటమినులు వీనిలోని పుష్టికరపదార్థాలే గాకుండా బోర్నవిటలో ఇంకా ఎన్నో ఆరోగ్యానికవసరమైన లోహాలున్నాయి. ఆహారాన్ని శక్తిగా మార్చివేసేవిధంగా బలాన్నిస్తుంది. సులభంగా జీర్ణమౌతుంది. రుచికరముకూడ. అందరు సంతోషంగా సేవిస్తారు. ఒకటే సాక్ష్యము: ఈపానీయాహారాన్ని 14 వేల డాక్టర్లు సిఫార్సుచేశారు!

ఉచితముగా కావాలంటే
వివరాలకు
టి. టి. కృష్ణమాచారి
మద్రాసు.

## CADBURY'S
# BOURN-VITA

దినమంతా ఉత్సాహంగా ఉండటానికి

అన్ని కెమిస్టు షాపుల్లోనూ 1 పౌను ½ పౌ. ¼ పౌ. టిన్నుల్లో అమ్మబడుతూవుంది.

బోర్నవిల్లి, ఇంగ్లండులో కాడ్బరీస్‌వారిచే చేయబడినది.

B V 18



*Care for your gums*

*as you do for your teeth*

పళ్లవలెనే చిగుళ్లకుకూడా శ్రద్ధతీసుకో

సాధారణ టూత్ పేస్టుతో పళ్లు తోమితే పళ్లు పాడు గాకుండా అది తాత్కాలికంగా ఆపుతుంది. కావల సిందేమిటంటే పూర్తిగా శుభ్రపరచి నోటిలోని ఆసిడ్లను విరోధించే టూత్ పేస్టు. పళ్లు పాడయ్యేదంతా ఈ ఆసిడ్లవల్లనే.

ఉమ్మినీటిని ఎక్కువగా ఊరిస్తూ ఉమ్మినీటిగ్రంథులు నోటిలోని ఆసిడ్లను ఎదుర్కొనగలవు. టూత్ బ్రష్ చేరలేని సందుల్లోకంతా యీ వుమ్మినీరు ప్రవేశించి ఆసిడ్లను కడిగివేస్తుంది. దీనికి ఉమ్మినీరు సరిగా ఊరుతూవుండాలి గదా!

ఈ గ్రంథులు సరిగా యీ ముఖ్యమైన పనిని చురుకుగా చేయవలెనంటే నీమ్ టూత్ పేస్టుకంటే మంచిది లేదు. ఎందుకంటే వేపలోవుండే ఉత్కృష్టగుణాలు యీ ఒక్క టూత్ పేస్టులోనే వున్నాయి.

**'Neem'**

**TOOTH - PASTE**

## నీమ్ టూత్ పేస్టు

పళ్లను శుభ్రపరచి చిగుళ్లను ఆరోగ్యంగావుంచుతుంది.
కలకత్తా కెమికల్ వారిచే తయారు చేయబడినది.

నం. 23, ఎర్రబాలుచెట్టి వీధి, మదరాసునకు కలకత్తా కెమికల్ వారికి ఉచితంగా ఇచ్చే శాంపులుకు ఒక కార్డు వ్రాయండి.

---

# కావలెను

మా భవానీసిల్కు, నూలుతివాసీలు, వీటితో చేయబడిన చేతిసంచులను అమ్ముటకు హిందూదేశములోను, యితర దేశములలోనూ ఆర్డర్లను కేన్వాసుచేయుటకు కమీషను పద్ధతి మీద పనిచేయుటకు మంచి పలుకుబడి గల ఏజంట్లు కావాలి.

ఉత్తరప్రత్యుత్తరములు ఇంగ్లీషులోనే జరపాలి

వివరాలకు:

## జయం అండ్ కంపెనీ,

భవాని, (సౌత్ ఇండియా).

---

ఫోన్ 8461:

## హాఫ్టోన్ బ్లాకులు

## లైన్ బ్లాకులు

జింకుతోకానీ రాగితోకానీ

తయారుచేయుటకు

ఉక్కుమొహర్లు, రబ్బర్ స్టాంపులు

లాంటరన్ స్లైడ్సు.

**NEWTON & CO.,**

**Fine Art Engravers**

**80, Wallajah Road, Mount Road, Madras.**

చక్కని పనితనము, శీఘ్రముగా పనిచేయుటయు చౌకధరలు మా లక్ష్యము.

# అబల కాదు—సబల?

శ్రీమతి వల్లభనేని రంగాదేవిగారు



కుసుమము లాగా
కోమల మయినా
విశ్వ విధాత్రిని
అబలనుటే విధి
చెల్లునౌగా ?

జగతీ జననీ
విశ్వ విధాత్రీ
మహిమనా మహిమయగు
మాతృ జాతినిటు
పలుకుటగా ?

నరునీ, నారిని
కార్యము లెన్నో
కడతేర్చంగా
ప్రకృతి మాతే
సృజించెగా ?

మహిళా మానస
మర్మము గాకే
అబలని పలుకుచు
నుండెదరా యీ
పూరుషులూ ?

ఆడువారి పయి
పెత్తన మాడగ
నయమున భయమున
నమ్మగ బలికే
పలుకు లివా !

మానవ చితిపయి
దానవ—తాండవ
నృత్యం, పశుబల
రూపవు మూర్తే
గాదా మరి ?

పాశవిక శక్తుల
భేదించంగా
నున్నత యాత్మ బ
లవికాసంబే
ఆధారం ?

ఆత్మ బలంబే
అంగన శక్తి
నైతిక బలమే
నారీ శక్తికి
పూతంగా ?

సృజించు చుందురు
సుదతీ మణులా
సంహారంబే
చేత గాకనా ?
కాదు ? కాదు ??

నర సంహారం
పురుషా నందం
నారీ మణికి
క్రూర కృత్యమే
సహ్యముగా ?

నరుని కభేద్యవు
కార్యము గూర్చగ
నారీమణి యే
శక్తి రూపమున
సాధించును ?

పతినీ పుత్రుని
యుద్ధ రంగమున
పురికించంగా
మహిళా మణియే
మంత్రించును ?

కరంటు లేని
బల్బే పురుషుడు
కరంటు రూపవు
కాంతయె లేనిచో
వెలుగేది ?

వీరుల కత్తులు
చేయగ లేనివి
మహిళా మణులా
మందహాసమే
చేయునుగా !

అవసర మయితే
అంగన కూడా
రణ రంగంబున
రాణించుటలూ
కనలేదా ?

పడతి వికాసం
పరి వారంపు
పాలన లోనే
గంభీరం బయి
కనపడుగా ?

జగతీ, సంఘపు
క్షేమం బంతా
మహిళామణిలో
ఘనీ భవించుట
మరచారా ?

# నిరాడంబరత్వము

శ్రీమతి వై. వెంకటేశ్వరమ్మగారు

నవంబరుమాసపు "గృహలక్ష్మి"లోని 'మలబారు సందేశము'అను వ్యాసము మలబారులోని స్త్రీల నిరాడంబరత్వమును వర్ణించుచు ఆంధ్రస్త్రీలకు దుస్తులయందును నగలయందును గల వ్యామోహమును తెలుపుచున్నది.

సాధారణముగా నిరాడంబరత్వమునకు రెండేకారణములు ధనము తక్కువయగుట విద్య యెక్కువగ నుండుట.

మలబారుతీరమున వర్షము చాలయెక్కువ యగుటచే ఎచ్చటచూచినను భూమి పచ్చగనే కన్పడును. బీడుభూమియే కనుపించదు. పంట యింత సమృద్ధిగనున్నను అచ్చటిజనులు సామాన్యులు-చాలమంది యిండ్లువాకిండ్లు విడిచి యితర స్థలములకువచ్చి పనులు చేయుట అందరకును తెలిసినవిషయమే. ఇప్పుడేయింట చూచినను మలయాళపు నౌకర్లే. దీనివలన అచ్చట జనసంఖ్యకు తగి నన్నిపనులును కావలసినధనమును లేనట్లు స్పష్టమగుచున్నది.

మానవులకు ముఖ్యముగ గావలసిన భోజనాదికముల ఖర్చులైన తరువాతనేగదా అలంకారముల ఆలోచన? ఇట్టి సందర్భము లలో మలయాళపుస్త్రీలకు నగలయొక్కయు విలువగల దుస్తులయొక్కయు ఆలోచనకు అవకాశమేలేకపోయినది. సాధ్యమైనంత తక్కువవ్యయముతో కాలము జరుపుచుం దురు. వారి భోజనముగూడ చాల సామా న్యముగ నుండును. దుస్తులన్ననో పురుషుల కును, స్త్రీలకునుగూడ ఒక రెండుగజముల మల్లుబట్టయున్నచాలును. ఇటీవలనే స్త్రీలు జాకెట్లనుతొడిగి దానిపైన ఒకతుండు గుడ్డను వేసుకొనుట మొదలుపెట్టిరి. ఇప్పటి కిని మలబారులో కొంచెము వయసుచెల్లిన స్త్రీలును అనాగరికులును ఒక్కపంచెను మాత్రమే ధరింతురు. నాగరికులైనవారు ఇతర స్త్రీలవలెనే అనేకరంగులలో చీరలనే వాడుచున్నారు. దీనివలన మలబారులో ధనవంతులే లేరని నాయుర్థముకాదు. ఏదేశ ములోనైనను చాలమంది ఆచరించుపద్ధతులే వాడుకయగుచుండును.

ఇక ఆంధ్రులన్ననో మొదటినుండియు ధనము సమృద్ధిగ నుండుటచే విలువగల నగలను దుస్తులను వాడుట కలవాటుపడి యుండిరి. పూర్వము వారు చాలవరకు ధనమును బంగారముగమార్చి నగలరూప మున దాచుకొనుచుండిరి. ఈపద్ధతి యిప్పటి దివాలాతీయు బ్యాంకులలో వేయుటకంటె మంచిది. వడ్డీలేకున్నను అసలుఉండునుగదా!

అవసరమైనపుడా నగలనే ధనముగా వాడు కొనుచుండిరి. పూర్వము ఆంధ్రులు వజ్రములకు సొమ్ము పెట్టెడివారుకారు. "రాళ్లకు పెట్టినసొమ్ము రాళ్లపాలే"యని వారి నమ్మకము. ఈ కారణముచే వారు ఘనమైన కంటెలు, కాసులపేర్లు మొదలైన నగలను చేయించుకొనుచుండిరి. ఆనగలవలన వారి అందము హెచ్చుచున్నదా లేక తగ్గుచున్నదా యను ఆలోచనయే వారికి కలిగి నట్లులేదు. ఎన్నినగలను ధరించినను, వారు మలయాళపు సోదరీమణులవలె చెవులను భుజములవరకు వ్రేలాడునట్లు చేసుకొనలేదు. మలబారులో యితరసొమ్ము లెట్లున్నను చెవులకు మాత్ర మెంతపెద్ద అభరణములను ధరించిన సంఘములో నంత గౌరవమును పొందుచుండిరి. గనుక ఆడబిడ్డల చెవులకుట్లను పెంచుట విషయమై చాల శ్రద్ధ తీసుకొనుచుండిరి. ఇప్పటికినీ మలబారులోను దక్షిణమున తమిళులలోను అనాగరికులుగా నున్నవారు తమబిడ్డల చెవులకు బరువైన సీసపురింగులను వేసి కుట్లను పెంచుదురు. నాగరికులైనవారిలో కొందరు చిన్నతనముననే అట్లుచేయబడిన తమ చెవులను వైద్యునిచే శస్త్రము చేయించుకుని చిన్నవిగా చేయించుకున్నవారున్నారు. మొత్తముమీద ఈ వాడుక తగ్గుచున్నది.

నాగరికత హెచ్చినకొలది ఆంధ్రులలో పూర్వపునగలు అరుదగుచున్నవి. క్రమముగా నగలయందాశకూడ తగ్గుచున్నది. మలబారులోనే గాక హిందూదేశమందంతటను నాగరికురాండ్రైన స్త్రీలు చేతికి రెండు గాజులును, మెడలో ఒకటిలేక రెండునన్ని గొలుసులను మాత్రమే ధరించుచున్నారు. క్రమముగా ఈ గొలుసులకుబదులు పూసల హారములును బంగారుగాజుల స్థానమున గాజుగాజులును వచ్చుచున్నవి.

విద్యమాత్రము — ముఖ్యముగ స్త్రీవిద్య—మలబారులో ఆంధ్రజిల్లాలలో కంటె అనేకరెట్లధికముగ వృద్ధిపొందినది. అయినను ఈవిద్య నిరాడంబరత్వమునే దీక్షగా చేసికొనునట్లు చేయునంతటి జ్ఞానము నిచ్చునదిగా తోచదు. మలబారులోని పాఠశాలలలోను, కళాశాలలలోను నేర్పు విద్యకూడ యితరచోట్లవంటిదే గనుక వారి విద్య యేమాత్రమును ఈ నిరాడంబర వేషమునకు కారణము కాజాలదని తేలుచున్నది. అయినను విద్యాధికులకు విద్యావిహీనులకంటె విచక్షణాశక్తి యెక్కువగ యుండును. గనుక కొంతవరకు మాత్రము వారి నిరాడంబరత్వమునకు విద్య కారణమైన గావచ్చును.

చక్కదనమున మలయాళపుస్త్రీలుగూడ ఆంధ్రస్త్రీలవలె సామాన్యులు. వీరిలో నెవరునూ కాశ్మీరదేశపు స్త్రీలకు సమానలుకారు. ఆదేశమున ఘోషాపద్ధతి యుండుటచే స్త్రీలు బయుటఅంతగా కనుపించరు. సామాన్యస్త్రీలు-పనిపాటలు చేసుకొనువారు—బట్టలతో తమదేహమును దట్టముగ కప్పుకొందురు. చలి విశేషముగ

టచే వీరు ప్రతిదినము స్నానముచేయరు. దుస్తులు చాల మురికిగనుండును. అట్టి మలినవస్త్రములతో కప్పబడియున్నను సుందరములగు వారిముఖములు ప్రకాశించుచునే యుండును. స్త్రీ పురుషులందరును పచ్చనిరంగుగల శరీరములతో ఆజానుబాహులుగ నుందురు. దీనికంతయు ఆ దేశపు శీతోష్ణస్థితియే కారణము. వస్త్రాలంకారములతో మార్పునొందకయున్న సహజసౌందర్యమును చూడవలెననిన ఆ కాశ్మీరవనితలనే చూడవలెను.

ఏదేశపు స్త్రీలైనను సహజసౌందర్యమును పోషించుకొనవలెనేగాని విలువగల నగలకును, దుస్తులకును ధనవ్యయము చేయరాదు. కొన్ని సమయములయందీ అలంకారములు సహజముగనున్న అందమును పాడుచేయుటకూడ కద్దు.

విద్య అభివృద్ధినొందినకొలది ఈవ్యామోహము తగ్గగలదనుటకు సందేహములేదు. ప్రస్తుతము ఆంధ్రస్త్రీలకు తగిన విద్యాసౌకర్యములులేవు. దీనికి కావలసిన ప్రయత్నములు త్వరలో చేయవలసియున్నది.

## కర్షకా!

శ్రీ బంకుపల్లి రామజోగారావుగారు

ఉ. కుక్కుటరావముల్ వినిన గొంచక లేచి నిరోగమెంతయుఁ
జక్కఁగ జేసెదీవు సువిశాల హృదంతరభావ మెంత పెం
పెక్కినదో గదోయి నిను నెంతయు గాంచుచు నున్న కొద్ది నా
కెక్కడినుండి వచ్చునొకొ యీదృశభావము కర్షకోత్తమా!

చ. పొలములలోని కేగి తలపుల్ చివురించిన చేను గాంచుచుఁ
వెలుపల నున్న కంచెలను వీడకయుండగ గట్టి చేయుచుఁ
జలముల సస్యసంపదకు జాగొనరింపక గూడజల్లుచుఁ
మెలఁగుచు నున్న నిన్ను గన మేను చెమర్చును నాకు కర్షకా!

ఉ. ఎండలలోన కూలబడి యెంతయును కల్గి తోడ గ్రుమ్మగుచుఁ
కుండలలోనిదౌ చలిదికూట నొకింత భుజించి యెంతయుఁ
కండలలోని రక్తమది క్రాగుచు నుండగ గొండలన్నిటిఁ
పిండిగ జేసెదీవు పతి భీకరవృత్తిని కర్షకోత్తమా!

ఉ. వారమువారముఁ బనులబాటుల సేయుచు భూమిలోనిదౌ
సారము దీసి రేబవలు చక్కని నిద్దురయుఁ సుఖంబులే
కారయు భద్రముల్ సలిపి యంతయు దెమ్మనుచున్న యా జమీం
దారుల కొప్పగించెద వుదార మనీషివిగాగ కర్షకా!

# *** రిక్షా ***

శ్రీమతి పి. ఆర్. శాంతగారు

రామన్న చాలా నమ్మకమైనబంటు. చాలా కాలమునుంచి బుచ్చిబాబుగారింట్లో కొలువుచేస్తూ వున్నాడు. షుమారు యిరవై సంవత్సరాలు తన జీవితాన్ని వారింట్లోనే గడిపినాడు. బుచ్చిబాబుగారికి రామన్నంటే అమితయిష్టం. ఆఫీసునుంచి యింటికిరాగానే రాముడువచ్చి ఆయన మేజోళ్లు అవి విప్పి కాఫీ పుచ్చుకొన్నతర్వాత బాబుగారు పడక కుర్చీలో కూర్చొనివుంటే కాళ్లుపట్టుతూ బాబుగారికి చెప్పతూ ఆయన చెబుతూవుండే విషయాలన్నిటికి వూకొడ్తూవుండేవాడు.

బుచ్చిబాబుగారు అంత ధనవంతుడుకాకపోయినా తమతిని యితరులకు పెట్టగల సామర్థ్యాని కాతని కేమి తక్కువలేదు. అతను మద్రాసులో Secretarietలో పనిచేస్తూ యిప్పుడు నెలకు రమారమి నూరురూపాయలు సంపాదిస్తున్నాడు. అతనికి లేక లేక కమలం పుట్టింది. బాబుగారికి కమలపై ప్రేమవుందోలేదో కాని రామన్నకుమాత్రము కమలాన్ని చూడంది ప్రాణాలువుండేవిగావు. కమలాన్ని యెత్తుకొని తిరిగేవాడు రామన్న ఎప్పుడునూ. తనకు భార్యబిడ్డలు లేకపోయినా కొందరు వృద్ధబ్రహ్మచారులవలెగాక కమలం అంటే మురిసిపోయేవాడు రామన్న. కమలం అంటే ప్రాణాలువిడచే వాడుకూడా. కమలం నిద్రపోయేంతవరకు తన చేతుల్లోనే ఆడుకుంటూవుండేది. తన దగ్గరవున్న కాని డబ్బుకూడా కమలానికి పిప్పరమెంట్లకొరకే వెచ్చించేవాడు. తన పంచ ప్రాణాలుకూడా కమలంలోపెట్టుకొని తండ్రికంటె, తల్లికంటె అధిక గారాబంగా పెంచుతున్నాడు కమలాన్ని. కమలకుగూడ రాముడు అంటే మిగుల యిష్టం. తల్లి దగ్గరకూడ అంత చనువులేదు, కమలానికి రామునిదగ్గర వున్నంతచనువు. రాముడు వుయ్యాల వూపందే కమలానికి నిద్రరాదు. రాముడు ఎత్తుకోంది కమలానికి తృప్తిలేదు. ఎవ్వరున్నా ఎవ్వరు లేకపోయినా రాముడు మాత్రము కమలందగ్గర వుండాలె, లేకుంటే ఒకటే యేడుపు. ఎప్పుడైన రాముడు పనిగా బయటకుపోతే రామునిహృదయం అంతా కమలముమీదనే. ఆపనిని త్వరగా ముగించుకొని యింటికి పరుగుతీస్తూవచ్చేవాడు రాముడు. ఏడుస్తూ వున్న కమలం అతన్నిచూస్తూనే ఏడుపుచాలించి ఎత్తుకోమని చేతులుజాచేది. ఆయాహ్వానిస్తూన్న చేతులను ముద్దుపెట్టుకుంటూ 'రా తల్లీ రామాయమ్మా, యెంతగా యేడుస్తున్నావుతల్లీ' యని ఆదరిస్తూ తన చేతుల్లోకి ఆ చిట్టి కమలాన్ని తీసుకొని తన హృదయానికి గట్టిగా అదుముకొనేవాడు. రాముడికి దినము బాబుగారిని రిక్షాలో తీసుకొని ఆఫీసులో దించేసి రావటం, మళ్లీ సాయంత్రము ఆఫీసునుంచి బాబుగారిని యింటికి తీసుకొనిరావడం అతని నిత్యకృత్యం. అతనికిచ్చే జీతము అతి స్వల్పమైనా-ఆ జీతమునుకూడా అతనికి అక్కరలేదు. తన భోజనము బాబుగారి యింటిలోనే జరిగిపోతూంది. ఆవచ్చిన నాల్గురూపాయలు రాముడు ఎక్కడనో నైజాములోవున్న వృద్ధమాతకు పంపేవాడు. తను ఒక్కరూపాయివుంచుకొని ఆ వొక్క రూపాయిగూడా కమలంకోసమే ఖర్చుపెట్టేవాడు. తన కమలానికి రెండుమూడు సంవత్సరములు వచ్చినప్పటినుండి కమలాన్నికూడా సాయంత్రం రిక్షాలో కూర్చుండబెట్టి బీచికి తీసుకపొయ్యేవాడు. కమలానికి బీచీకిపోవడం అంటే యిష్టమే. అప్పుడప్పుడు రిక్షా

మీద వెళ్లుతుంటే కమలం రాముణ్ణి యేవేవో ప్రశ్నలు వేస్తుండేది. "రాముడూ నీవు కూడా నాన్నగారిమాదిరి ఆఫీసుకుపోలేవు? ఎందుకు రాముడూ?" "పోతానుకాదుతల్లీ! వారిని రిక్షాలో ఆఫీసులో దిగబెట్టి వస్తానే!"

"అట్లాగాదు రాముడూ నీవు నాన్నగారిమాదిరి అక్కడనే ఆఫీసులో పనిచేయవే—మరి ఎందుకు?"

"అమ్మా! నాకు చదువురాదుతల్లీ, చదువువస్తే యిట్లావుంటానా?"

"అయితే నీవు యెందుకు చదువుకోలేదూ? రాముడూ మరి"

"అమ్మా నేను బీదవాణ్ణి అవడంచేత చదువుకోలేదు తల్లి!"

"బీదవాడంటేయేమిటి రాముడూ" అని యీలాగే తనకిఅర్థముగాని మాటలు మాట్లాడేది. అట్లాకమలాన్ని చూస్తే మురిసిపోయేవాడు రాముడు.

కమలకు సుమారు 8 ఏండ్లువచ్చాయి. బుచ్చిబాబు గారికి కొంచెము (Increment) వచ్చింది. రిక్షాకన్న కారుకొంటే బాగుంటుందనుకొన్నాడు బాబుగారు. ఒక సెకండుహాండు కారు సరసంగాకొంటే రిక్షాకన్న బాగావుంటుంది. డాబుగాకూడా వుంటుంది, ఆఫీసుకుకూడా త్వరగా పోవచ్చునని కారుకొందామని ప్రయత్నములోవున్నారు బుచ్చిబాబుగారు. ఇంట్లోఅందరు సరే అంటేసరే అనుకున్నారు. అయితే రాముణ్ణి ఏమిచెయ్యాలి—దానికి ఒకటే Solution రాముణ్ణి వెళ్లిపొమ్మనడమే. రామునికి సుమారు 60 ఏండ్లకుపైగా వుంటాయి. ఇంక వాడు రిక్షాయేమి లాగగలడు? ఎట్లానైనా రాముడికి స్వస్తిచెప్పాలనని అనుకున్నారు. కమలమాత్రము రాముడు పోతాడు అని నప్పటినుంచి తహతహపడిపోతోంది. రాముణ్ణి విడిచి యెట్లావుండడము? బాబుగారు రాముని వార్ధక్యాన్నికూడా కనిపెట్టకపోయినాడు. రామునికి పని లేకుండా యింట్లోవుంచుకోడం ఆయనకి ఏమాత్రం యిష్టములేదు. కమలానికి యిష్టములేమాత్రం ఏమి? రాముణ్ణి యింట్లో వుంచుకోడానికి వలనుపడదన్నాడు బాబుగారు. కమలంకూడా రాముణ్ణి పంపొద్దనిచెప్పింది. అయితే ఆచిట్టి తల్లిమాట బాబుగారు లక్ష్యపెట్టుతారా? తనుకార్లో కూర్చోవడం-డాబుగా కారులోనుంచి ఆఫీసులోదిగడం యివన్ని రామునికోసం వదులుకుంటాడా బుచ్చిబాబుగారు?

చివరకు రాముడు యిల్లు రెండుమూడుదినాల్లో వదలవలసిన పరిస్థితియేర్పడింది. ఇంట్లో యెవ్వరికి కలతయేమిలేదు కాని కమలానికి ఏమితోచడములేదు. దినము చక్కగా చదువుకునేపిల్ల చదువుకోడం మానేసింది రెండుమూడుదినాలుగా—ఎప్పుడు రాముని దగ్గరనే కూర్చొని మాట్లాడుతూవుంటుంది. రాముడు ఏడుస్తాడు కమలా యేడుస్తుంది. కమల రాముని వళ్లో కూర్చొని అతని కండ్లనీళ్లుతుడుస్తూ "రాముడూ ఏడ్వవద్దు. నేను పెద్దదాన్నై పెండ్లిచేసుకున్నాక నా దగ్గఱకువస్తువు కానిలే. మా నాన్న నామాటవినరు-నీవు ఏడిస్తే నాకు యేడుపువస్తుంది రాముడు;..." వస్తున్న దుఃఖాన్ని అణుచుకుంటూ "అట్లాగే కానిలే తల్లి నేను ఏడవనులేతల్లీ పోయి చదువుకో అమ్మ నాన్నగారు చూస్తే కోపపడతారు" అన్నాడు రాముడు.

తుదకు రాముడు బాబుగారివద్దకుపోయి అతని పాదములదగ్గర కూర్చున్నాడు. కండ్లల్లో నీళ్లు గిర్రున తిరుగుతూవున్నాయి. "బాబూ! ముసలివాణ్ణయి నాను. మీరు నాకు జీతముకూడ యివ్వనక్కరలేదు. బాబూ! అమ్మాయిని చూస్తూ మీపాదాలదగ్గర పడి వుంటాను. బాబూ మీరు వదిలితే నేను వూరికే చచ్చిపోతాను" అని యెంతో మొరపెట్టుకొన్నాడు. బాబు హృదయం కరగలేదు. "నిన్ను పోషించడానికి వలనుపడదు. నీకు రావలసినసొమ్ము తీసుకొని నీవు రేపు వెళ్లిపో" అన్నాడు బాబు. తుదకు రాముని పూర్వపు నమ్మకము అతనిసేవ బాబుగారిమనస్సు కరిగించలేదు. రాముడు వెళ్లిపోవలసిందేనా? కమల ప్రేమపూరిత హృదయానికితప్ప యీ విషయం మరెవ్వరిని కించెత్తైనా గదల్పలేదు. అనాటిరేయి కమలకు నిద్రకూడా పట్టలేదు. ముసలిరాముడు తన

రిక్షాతో మదరాసునగరమున వీధులలోకి త్రోసి వేయబడినాడు. రాముణ్ణి అందరు మరచిపోయినారు. కమల మరచిపోలేదు. తనకిచ్చిన జీతము మునిస్వామిలాటి లైసెన్సుకు సరిపోయింది. దినమంతా కాచుకున్న, నాలుగణాలు రూకలుకూడా రావడం కష్టమయింది రాముడికి. పైగా వార్ధక్యం కష్టంచేయలేవు అతని వృద్ధావయవాలు. ఏమిచేస్తాడు— బాబుగారికి దయలేదు అతనిమీద.

నాలుగైదు సంవత్సరాలు గడచినవి. రాముడు దినమూ కమలాన్ని కలలో చూస్తున్నాడు. కమలం ఆనాడు తన కన్నీళ్లుకుడుస్తూ చెప్పినమాటలు యింకా అతనికి చెవుల్లో మ్రోగుతున్నాయి 'రాముడు! నేను పెద్దదాన్ని అయినతరువాత నా వివాహమయిన తరువాత నీవు నాదగ్గరకువస్తువుగానిలే నాయనగారు నా మాటవినరు'. ప్రపంచములో ఒకవ్యక్తి అతనికి కనబడుతూవున్నది. ఆవ్యక్తి కమలం. కమలం అతనికి సర్వంగా కనబడుతూవుంది. ఒక్కొక్కమారు కమలాన్ని తన వూహల్లోనుంచి త్రోసివెయ్యాలని తలుస్తాడు. కమల యెవరు? నేనెవరు? నాకు కమలానికి—యేమి సంబంధము అని అనుకుంటాడు. కాని మరు నిముషం తన చిట్టితల్లి కోమలహృదయం ఆమాటలు అతనికి జ్ఞాపకమునకు వస్తాయి. కమలం పెద్దదయ్యేది యెప్పుడు?

ఇట్లాంటి మధురభావాల్లో అతడు ఒక్కొక్కతూరి తన ఆకల్నికూడ మరచిపోతాడు. మరు నిముషం యీ ఘోర ప్రపంచం అతనికి కనబడి కలతపొందింప చేస్తుంది. పెద్దపెద్ద భవనాల్లోనుంచి కారులోపొయ్యే వాళ్లను చూస్తాడు. వారు సర్వభోగాలను అనుభవిస్తూవున్నారు. హోటలుదగ్గర రిక్షాపట్టుకొని నిలబడుతాడు. కడుపునిండా మెక్కి తాంబూలాన్ని వేసుకొని వచ్చే యువకులను చూస్తాడు; తన పరిస్థితి చూస్తాడు. ఇవన్నీ అతన్ని పిచ్చివాణ్ణిగా చేస్తాయి. 'రిక్షాబాబూ' అంటే ఒకయువకుడు బదులు చెప్పతాడు! "నీవు కూర్చోరా నేను యీడ్చుకపోతా—ఏమిస్తావు' అని కడుపు తరుక్కుపోయేలాగు మాటలాడుతాడు. ఈ మాటలన్నీ అతడు సహించలేడు. కడుపుకాలుతుండే కొద్ది అతనికి కోపము ఎక్కువ అవుతూవుండేది.

ఒకదినము ఆకలికి తట్టుకోలేక తన జీవనాధారమైన రిక్షాను అమ్మివేసినాడు. పది దినములు కడుపునిండా అన్నము తినగలిగినాడు. అవతల గతియేమి—తెల్పని కేతుక. యిక రిక్షాగూడ లేదు. ఏమిచేస్తాడు. 'అడుక్కోవలసిందేనా?' అంతే అని సమాధానమిచ్చింది అతని అంతరాత్మ. 'బాబూ కడుపు మాడిపోతూంది. ఒకకానీ డబ్బు ఇయ్యబాబూ' అంటే ఒక యువకుడు అతనివైపైన జూడడు. మరియొకడు అతన్ని కఠినంగా మాటలాడుతాడు హృదయము కోసికోపొయ్యేట్లు. అతనికి కోపంవస్తుంది, ఒక్కొక్కసారి. అంతకన్నా ఏమిచేయగలడు? శరీరం కృశించుకపోయ్యింది. ఎముకలు బయటకు కనబడుతూ వున్నాయి. ఒకప్రక్కన ఆకలి, మరియొక్క ప్రక్కన వార్ధక్యం, ఇంకొక ప్రక్కన కోపము, అన్ని అతని హృదయాన్ని మాడ్చి వేస్తున్నాయి. బస్సుస్టాండు దగ్గరకుపోయి అడుక్కుంటూవున్నాడు. ఒక మహారాజుకైనా ఒక్క కానిడబ్బు యివ్వటానికి చేతులాడవు.—'బాబు రెండు దినాలుగా అన్నము లేదుస్వామీ; ఒక కానీ కూడా దొరకలేదు బాబూ. ఏమి, బాబుగారు, ఒక్కరైన ధర్మంచేయరా! వృధాగా అంతడబ్బు వెచ్చకేస్తారే! ఒక కానీడబ్బు ఆకలితో మాడే వానికి వెయ్యడానికి మీకు చేతురావా స్వామీ; స్వామీ, ఒకసిగరెట్టు విలువచేయదుగదా; ఒక కానీ! మీరు ఒకసారి బీడాకేసుకున్నంత విలువగూడా చెయ్యదుగదా స్వామీ! ఏ మహానుభావునికి గూడా కరుణ కలుగలేదేమి? బాబూ—ఒక్క కానీ బాబు. ఒక యిడ్లీ కొనుక్కొని కొంచెము నేను ఆకలి పట్టుకొని వుంటాను బాబూ—కడుపునిండిన స్వాములకు కరుణలేదా! నాయనలారా! ముసలివాణ్ణి బాబూ! అని యేమేమో తన అవస్థ చెప్పుతుంటే, బస్సులో నుంచి ఎవరో ఒకరు ఒకకానీ క్రింద వేసినారు. బస్సు కదలిపోయింది. ఆ కానీకోసమై రాముడు కొంచెముదూరము పోయినాడు. ఆకలి బాధలో వెనుక కారుశబ్దమైనా విన్నవాడు గాడు. ఒక నిముషములోనే కారు అతనిమీదకి పోయింది. కమలం— నా చిట్టితల్లి! అని ప్రాణాలు వదలినాడు రాముడు. కారులోనుంచి ఒక యువతి, ఆమె భర్తదిగి చూచినారు. కమలం అన్నమాట గుర్తుపట్టింది, 'రాముడు' అని శవాన్ని చూచి నిర్ఘాంతపోయింది కమలం....

— ముహూర్తం వేళకి మూడుముళ్లు —



'వాహినీ'వారి వందేమాతరంలో ఒక దృశ్యము

శ్రీమతి కజిన్సు సతిగారు

స్త్రీల ప్రాణ, మాన మర్యాదలను రక్షించుటకుగాను అమెరికాలో ప్రపంచ స్త్రీల సంఘ మొకటి యేర్పడినది. ఈమె భారత దేశము తరఫున ప్రతినిధులు.

# జాతి సమితిలోని స్త్రీలు

శ్రీమతి క్రొత్తపల్లి సరళాదేవిగారు

మనదేశమున వేదకాలమందు స్త్రీలుచేసిన ఘనకార్యములనుగురించి తెలిసినప్పుడు ప్రతివారికి ఆనందాశ్చర్యములు కలుగుచుండును. పురుషులవలెనే స్త్రీలును మంత్రములు రచించిరి; యుద్ధములు చేసిరి. ఇట్టివెన్నియో కలవు. నాటికిని నేటికిని ఎన్నియో మార్పులు జరిగినవి. అప్పుడు స్త్రీశక్తి ప్రత్యక్షముగా పనిచేసినది. ఇప్పుడది ప్రచ్ఛన్నముగా పనిచేయుచున్నది. దీనిని ముందు స్త్రీలోకము గుర్తించిననే తప్ప పురుషలోకము గుర్తెరుగనేరదు. పురుషుడు స్త్రీని అర్థముచేసికొనలేని స్థితిలో నున్నాడు. కనుకనే నేటి స్త్రీ, పురుషుని దృష్టిలో అబల; నిస్సహాయ.

నేడెన్నియో యుద్యమములు చెలరేగినవి. అసంఖ్యాకములైనటువంటి సంఘములు నెలకొల్పబడినవి. వాటిలో నానాజాతిసమితియొకటి. అమెరికా, ఐరోపా మొదలగుఖండములలోని, గొప్ప మేధావులయొక్కయు, రాజకీయవేత్తలయొక్కయు ప్రోత్సాహ ప్రోద్బలములచే నెలకొల్పబడిన సమితి ఇది. ఇందు గొప్పవక్తలను, రాజ్యాంగ దురంధరులును పాల్గొనుచుందురు. హేమాహేమీలందరు సమావేశమై తమతమ దేశములయొక్క రాజకీయ ఆర్థిక సమస్యలపై వాదులాడుకొనుచుందురు. సంధిపత్రములు లిఖించుకొందురు. ఆయా దేశముల ప్రతినిధులు, ఒకప్పుడు శాంతముగను, మరియొకప్పుడుద్రేకముగను, మరియొక సమయమున వ్యంగ్యముగను తమతమ భాషలలో ఝరీవేగమున నుపన్యసించుచుందురు.

ప్రతియుద్యమమునందును, ప్రతిసంఘమునందును స్త్రీశక్తి ప్రచ్ఛన్నముగను పరోక్షముగను పనిచేయుచుండును. అదేవిధముగ ప్రపంచములోని రాజనీతి విశారదులకు కేంద్రస్థానమైన నానాజాతిసమితిలో పెక్కుమంది నారీరత్నములు తమ ప్రతిభా ప్రభావముచే తమను చులకనగ చూచు పురుషపుంగవులకుగూడ సాధ్యముగాని కొన్ని బాధ్యతలను నిర్విఘ్నముగా, ఓపికతో నిర్వర్తించుచున్నారు. అట్టివారిలో యిరువురు మాత్రమే యెక్కువగ కొనియాడదగియున్నారు. వారిలో యొకయామెపేరు శ్రీమతి ఎగ్రెస్టీ యను నామె. ఈమె ఇటలీ దేశపు వనిత. ఈమెకు తనమాతృభాషలో వలెనే యింగ్లీషు, ఫ్రెంచి, జర్మనీభాషల యందుగూడ మంచి ప్రవేశముగలదు. వివిధ దేశముల ప్రతినిధుల యుపన్యాసములను అనువదించుచుండును. అంతరంగిక సమావేశములలో దుభాషిగ పనిచేయుచుండును.

ఎంత చిన్నపనికైనను యే సమావేశమునకైనను ఆమె బద్ధకించి యెరుగదు. ఓర్పుతో, ఓపికతో సమితి కార్యకలాపమునంతను అవగతము చేసుకొనుచుండును. ఆమెవారి మధ్యతమ దుభాషీత్వము నతి నేర్పుతో నిర్వర్తించుచుండును.

ఆమెకు నిరుపమానమైన జ్ఞాపకశక్తి గలదు. లోగడ జరిగిన కొన్నిసంవత్సరములనాటి అత్యల్పములగు విషయములు గూడ ఆమెకు నేటికిని కంఠస్థములు.

ఈమెకుగల యనువాదశక్తి ప్రపంచమున మరియేస్త్రీకిని, పురుషునికిని కానము. అలబర్టు టామసుగారిపేరు చాలమంది విని యుందురు. ఆయనొక గొప్పవక్త. ఆయన రాజకీయము, చరిత్ర, విజ్ఞానము అవి ఇవి యననేల అన్ని విషయములలోను జనరంజకముగ మాట్లాడగలడు. అద్భుతమైన తర్కసంపదను ప్రదర్శించి తనపక్షమును బలపరచుకొనును. ఇన్ని విశేషములు కలిగియు నిమిషమునకు 200 శబ్దములు మాట్లాడెడివాడు. ఇట్టి యుపన్యాస మహాసముద్రమున తేలియాడుచుగూడ శ్రోతల మనోభావములను కనుపెట్టుచుండెడివాడు. తాను చెప్పునది శ్రోతలు యంగీకరించుచున్నారో, కనిపెట్టి తనయుపన్యాసమును సర్వజనాంగీకార మొనర్చుకొనుచుండెడివాడు.

ఒకప్పుడు ఈ మహావక్త జాతిసమితిలో నిలబడి మాట్లాడుచుండెను. మేడమ్ ఎగ్రెస్టీ కొన్ని విషయములను నోటుచేసుకొనుచుండెను. తరువాత ఆమె ఆ పనిని మధ్యలో విరమించెను. ఇదంతయు ఆలబర్టు చూచుచుండెను. ఆమె తాను చెప్పువిషయమును నోటు చేసుకొనలేక వెనుకబడిపోయి ఇబ్బంది పడుచున్నట్లు భావించి యామెతో నిట్లనెను—"మేడమ్ ఎగ్రెస్టీ! నేను నీవు పడుచున్న యిబ్బందిని గుర్తించితిని. నే నిప్పుడొక దీర్ఘోపన్యాసము చేయవలసియున్నాను. కోరుదువేని నీకు అందనిచోట సహాయపడెదను. కనుక నీవు ఆతురత పడవలదు."

అప్పుడామె:—"అయ్యా! మీరు నా విషయమై చింతించవలదు. తమరు కోరినక్షణముననే తమయుపన్యాసమునంతను సాకల్యముగను, యథాతథముగను అనువదింపగలను. తమరు ముగించినతోడనే తమరు చెప్పినదంతయు వినుపించుటకు సిద్ధముగ నున్నదానను." అని శాంతముగ జవాబిచ్చెను. అప్పుడు శ్రోతలకు యాశ్చర్యమును అలబర్టునకు అవిశ్వాసమును కలిగెను. ఆమె వైపునకు యొకసారి పరికించి అర్థగంటసేపు తన సహజధోరణిని తన యుపన్యాసమును సాగించెను. అనంతరము ఎగ్రెస్టి విషయమునంతను యనువదించి చెప్పెను. పూర్వపు శ్రోతలవలెనె వారును ముగ్ధులైరి. ఇది ఎగ్రెస్టీసతియొక్క అసమాన అనువాద శక్తి.

రెండవయామె డాక్టర్ గుర్టుడు డీక్సను గారు. ఈమె నానాజాతిసమితికి సంబంధించిన రికార్డును జాగ్రత్తపెట్టుచుండును. ఈయమ విజ్ఞానములో డాక్టరు బిరుదము

బడసినది. సమితి స్థాపించినప్పటినుండియు పనిచేయుచున్నది. ఐరోపా సంగ్రామము నందు, బ్రిటీషు సామ్రాజ్యమునకు సేవ యొనర్చి గౌరవింపబడెను. విశ్వశాంతిని గోరి జాతిసమితిలో పనిచేయుటకు ప్రవేశించెను. నాటినుండియు నేటివరకును పనిచేయుచునే యున్నది. సమితి రికార్డును సురక్షితముగ నుంచి చర్చా సందర్భములలో నవసరమైన కాగితముల నందించుట యామె పని. ఈ పనిలో సంభవించెడు సాధకబాధకములు చాలగలవు. ఇకార్యమునకు నమ్మకము, తెలివితేటలు, నైపుణ్యము మొదలగు సుగుణము లెన్నియో అవసరము. ఆయా దేశములకు సంబంధించిన రికార్డులలోని విషయములు సమితి యనుమతిలేక వెలువడినచో అది యెంతయేని ముప్పువాటిల్లుటకు కారణభూతమయ్యెడి సందర్భములెన్నియో గలవు. వివిధ దేశములలోనిగూఢచారులు యిట్టి రహస్యములను తెలిసికొనెడి ప్రయత్నములో యప్పటికప్పుడు పొంచియుందురు. ఇట్టి పరిస్థితులలో పెక్కు దేశముల ప్రాణముల నన్నింటిని తనగుప్పెట నుంచుకొని డిక్సనుగారు గుట్టుగ పనిచేయుచుండును.

మఱియొక విశేషముగలదు. చర్చాకాలమున యే సంవత్సరమునాటి కాగితమునైనను అవసరమైనతోడనే యెదుట బెట్టవలసిన బాధ్యత ఆమెపై నుండును.

కావున డాక్టరు డిక్సనుగార్కి సమితికి సంబంధించిన సర్వవిషయములతోను పూర్ణ పరిచయముగలదు. కొన్ని సంవత్సరములనాటి విషయములనుగూడ ఆమె కంఠోపాఠముగ చెప్పుచుండును. సంధిపత్రములలోని నిబంధనలు అవి యేర్పరచుకొనిన తారీఖులను అందరకు ఆశ్చర్యము గల్గునటుల చెప్పివేయుచుండును.

డాక్టరు డిక్సనుగారి బీరువాలో మహత్తరమైన కాగితములెన్నియో గోప్యముగ నుంచబడియున్నవి. ఈ కాగితములందు లిఖింపబడియున్న విషయము నేటికిని బైట ప్రపంచమునకు దురూహ్యమే. ఎన్నియో వుపన్యాసములు, ఒడంబడికలు, వాగ్దానములు అరమరలో మరుగుపడియున్నవి. వాటి నిజపరిస్థితులు ప్రపంచములోని యే కొలదిమందికి మాత్రమో తెలిసియుండును. ఆమె తలచినచో పశుబలముచే విర్రవీగు దేశములగుట్టంతయు బయటబెట్టి ప్రపంచ మహాయుద్ధమునకు కారకురాలుగాగలదు. ఆ విషయములగుట్టును బైట బెట్టుటకు యెందరో ప్రయత్నించినను యేరికి సాధ్యముగాలేదు. ఇది స్త్రీయొక్క గోప్యము! బాధ్యతా నిర్వహణశక్తి!!

# ౦ నా కుటీరము ౦

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు

నీ సౌధంబులు, నీ మణీమయ గృహాళికమ్ము, నీ శిల్పతా
వైశారద్యము, నీ మనోహరకళా ప్రావీణ్యతల్, మాకు లే
వో నామీ! కడుభక్తి నేనొక కుటీరోద్యానముంగూర్చి, ఆ
వాసంబుందు నదే మదీయ సుఖ సంపత్స్థానమై భాసిలున్.

అదిగో! నా రమణీయ రాజ్యరమ దివ్యారామ రంగస్థలిన్
హృదయముల్ చివురింపఁగా మధురలాస్యేచ్ఛన్ విడంబించె న
ల్లదిగో! యామెపదారవిందయుగళోద్యన్నూపురధ్వానసం
పద; దానిన్ సతతమ్ము నేనును శ్రవణపర్వమ్ముగా గ్రోలెదన్.

ఆమె లాస్యకళా విలాసామృతంబు తనివితీరఁగ మనసారఁ ద్రావి త్రావి
యమరతం జెందినాఁడ, నన్యమ్ము లేల! శాశ్వతానంద సౌఖ్యరసంబుఁ గొంటి.

అదియె నాభోజ్య, మదియె విహారభూమి అదియె శయనీయ, మదియె ప్రాణైకపేటి
అదియె సర్వస్వ మదియె నా హృదయవీధి నా కుటీరముకంటె నన్యమ్ము లేదు.

ఒకనాఁడు బొండుమల్లెకు నాకులూడ్చుచుఁ బ్రోదిలో కరఁగి నే పొరలిపోదు
పోఁక బ్రోదుల నీరుపోయుచు నొక్కపు డిట్టిట్టె చేపనై యీఁదుకొందు
నవనిరాలిన యెండుటాకుల గలగలగలగల ధ్వనులతోఁ గలసిపోదు
తలిరుటాకుల కరాంగుళుల దువ్వుచు మేను మఱచి యుల్లల్లఁ దన్మయుఁడ నగుదు

నాకులో నాకనై మొక్క నలముకొందుఁ, బ్రసవమున ప్రసవమయి నే పరిమళింతు
లతను లతనయి చెట్టుపైఁ బ్రాకిపోదు, నా కుటీరోపవనమె ఆనందంబు.

సోదరా! నా కుటీరమే నాదుస్వర్గ భూమి; అనవోద్యానమే పుణ్యఫలము
శాశ్వత బ్రహ్మలోక సంస్థానమదియు సొమ్ము! నేనింక రాను! మీ పొందుఁగోర.

"ఓదయానందరూపిణీ! ఆదరమున నామృతాత్మను గాఁచి యుండే మనువుము
చాలు నిదియే" యటంచు నిచ్చలు స్మరింతు నా కుటీరోపవన దేవతాకుమారి.

# మాక్షి

నెమలి చంద్రమతిగారు

'మాక్షీ'

'ఏమి జ్యోతిష్, మాట్లాడక కొంచెంసేపు పండు కొని నిద్రపో, చాలా ప్రొద్దయింది'

'అయితే అయిందిగాని ఏమి పరవాలేదు. నేనిక ఎన్నోదినాలు బ్రతకను. నాజీవితము పూర్తికా వచ్చింది. మణి వాళ్ల తండ్రియింటికి వెళ్లాలికదా అని ఆలోచిస్తున్నాను. ఆయనిప్పు డెక్కడున్నారు? మర్చిపోయాను?'

'శీతారామపురంలో'

'ఔనౌను. శీతారామపురంకదూ, మణిని అక్కడికిపంపించు. అది మొదటే దృఢస్వరాలుకాదు. అందులో జబ్బుమనిషిదగ్గర వుంచటం మంచిదికాదు'

'నీవు చెప్పేది చాలాబాగుంటే, ఆమె నిన్నీస్థితిలో ఎలా విడ్చివెళ్లుతుంది?'

'డాక్టరేమిచెప్పినది మణికి తెలుసునా?'

'ఒకరు చెప్పాలా? చూస్తే నీస్థితి ఎట్లావుండేది తెలీదా?'

'మొన్నను ఒకదినం మాటమీద వాళ్లఅమ్మగారింటికిపోతే బాగుండునని చెపితేనే పూరికే ఏడ్చింది'

... ... ...

'ఏమమ్మా మీతండ్రిదగ్గరనుంచి కబురేమైనా వచ్చిందా? అనంతు వచ్చినాడే.'

'ఔను. వచ్చేశుక్రవారంనాడు మాచిన్నచెల్లెలికి అన్నప్రాసనపండుగ చేస్తారట. అందుకని నేను....'

'అలాగా మీచెల్లెలికి ఒక బంగారుగొలుసు తీసి కానుకగా పంపించు, మీవాళ్లు సంతోషపడతారు'

'కాదు నేనే పోవాలనుకుంటున్నాను. నేను నాచెల్లెలు పుట్టినవెనుక చూడనేలేదు. నాకు దాన్ని చూడాలని చాలా ఆశగావుంది.'

'సరి సరి! జ్యోతిష్‌ని ఈస్థితిలోవదలిపెట్టి వెళ్లుతావా? నీకు డాక్టరేమిచెప్పినది తెలీదా?'

'ఇప్పుడేమి తొందరలేదంటకదా చెప్పారు.'

'ఆయనలా చెప్పినప్పటికీ చూస్తే నీకు తెలీటంలేదా?'

'నాకు ముగ్గురు తమ్ములతరువాత యిదే చెల్లెలు. అందరికీ అదంటే చాలాముద్దు. పండుగ చాలా బాగా చేయబోతారట. నేనుగనుక పోకపోతే మాఅమ్మ మనసు కొచ్చుకుంటుంది.'

'ఔనౌను మీఅమ్మ ఏమనుకుంటుందో నాకు తెలీదుగాని, మీనాన్నమాత్రం యిప్పుడు జ్యోతిష్‌ని విడిచివస్తే కోప్పడుతారు. నాకు బాగాతెలుసు.'

'మీరు మానాన్నకు, ఆయన వంటిసంగతి కేమీ భయపడవలసిన కారణంలేదు. నేను వెళ్లినప్పటికి పరవాలేదు, పోయిరావచ్చునని ఒకజాబు వ్రాయండి'

'బాగాచెప్పావు! నిజం, నీవు వెళ్లితేనేమి వుంటేనేమి. వెళ్లినందువల్ల ఏమినష్టంలేదు. కాని జ్ఞాపకం వుంచుకో, నేనుగినుక మీనాయనకు జాబువ్రాసానంటే నామనసులో వుండేదంతా వ్రాస్తాను. మరి నీయిష్టం.'

'అలాగయితె మీరేమీ వ్రాయనేవద్దు. నేనే నాథ్రత్త నడుగుతాను. ఆయనేమీ అడ్డుచెప్పరు.'

'అమ్మాయీ, నీచేతలకి నేనెంతో వోర్చుకొని వున్నాను. యీపైని వొకనిముషంకూడా ఓర్చుకోలేను. నీసంగతి మీ నాయనకు బాగా తెలుసు. ఆయన నను మోసపుచ్చలేవు లే'

మాక్షీ వెళ్ళిపోయిన తర్వాత మణి తన గదిలోకి పోయి అలిగి పక్కమీద పండుకుంది. వారి యిరుగు పొరుగునవున్న స్నేహితురాండ్రువచ్చి, ఏమి సంగతని అడిగారు.

'చూడండీ ఎంత బాగుందో! నాచిన్న చెల్లెలికి అన్నప్రాశన చేస్తుంటే నన్ను పోనియ్యకుండా వున్నారు'

'ఔనుమరి. నిజముగా నీవు పోదలచుకున్నావా? నీ పెనిమిటికంత జబ్బుగావుంటే'

'ఆయనకు నేనేమి చేస్తున్నానుకి ఎంత ప్రయత్నించినాకూడా చేయలేను. అసలు ఈయింట్లో వుండటానికి నాకేమీ బుద్ధిపుట్టడంలేదు. వంటరిగా యీ యింట్లో నాకేమీ తోచడంలేదు. సహించలేకుండా వున్నాను ఇదంతా'

'నీవు కొత్త వింతమనిషివిలాగ వున్నావే'

'నాకు మీమాదిరి ఎవరేమనుకుంటారో అన్న భయంచేత నటించడం తెలీదమ్మా!'

'సరే ఏమిటి నీవూనా'

'నేను పోతాను, ఎవరు నన్ను ఆపలేరు'

'ఆ! ఎంత దయలేనిమనిషివమ్మా'

... ... ...

మణి ఆమె తల్లిగారింటికిపోవు తలంపుతో అంత వ్యసనపడిందనే సంగతి వినడంతోటే జ్యోతిష్ పడక మీద లేచికూర్చున్నాడు, దిండుసరిగాచేసి ఆనుకొని.

'మాక్షీ! ఆకిటికీతలుపు కొంచెం తెరచి అలాంతరును తీసి మరుగ్గాపెట్టు' అని కిటికీలోనుండి ఆకాశము వైపుచూస్తూ ఏదో ఆలోచించాడు. మాక్షీ అతను నిద్రపోతున్నాడనుకొంది. జ్యోతిష్ వున్నంట్టుండి 'మాక్షీ మీరంతా అనుకున్నట్లు ముందువలె లేదిప్పుడు మణి కదూ? ఇక్కడుండటానికే యిష్టం లేదు, ఎప్పుడూ రోసపోసలాడుతూ వుంటుందనికదా మీ తనుకోవడం? యిప్పుడు చూచావా?'

'ఔను బాబా, నేనిప్పుడు తెలుసుకున్నాను. ఎవరికీ అనుభవముమీదగాని ఏవిషయం తెలీదు. నీవిక పండుకో'

'నన్ను కొంచెం మాట్లాడనీ, కొంచెంసేపు ఆలోచించనీ ఏమి పరవాలేదు, మాక్షీ'

'అయితే అలాగే నీయిష్టం'

'ఒకప్పుడు మణియొక్క హృదయాన్ని నేనాకర్షించలేకపోయానని కోపంతో వ్యసనపడి వున్నాను. కాని నీవుమాత్రం సహించలేకపోయావు'

'లేదు జ్యోతిష్ నీవామాట అనవద్దు. నేనుకూడా ఎంతోఓర్పుతోనే వున్నాను'

'మనం యిష్టంవచ్చినప్పుడు మార్చుకొనడానికి మన మనస్సులు కట్టి మట్టిపెళ్లలతోటి చేయబడలేదు. సులభంగా మణియొక్క మనస్సు లాగుకొనడానికి చూచానుగాని తనమనసు తనకే తెలీలేదని ఒకప్పుడు తెలుసుకుంటుందని నాకు మొదటనే తోచింది.'

'అవును...'

'అందుకనే దాన్నిగురించి చూచీచూడనట్లు వున్నాను'

మాక్షీ ఒక నిట్టూర్పువిడిచి ఆలోచన చేయసాగింది. ఎన్నిమార్లో జ్యోతిష్, రాత్రులు వసారాలో బావకు తడుస్తోన్నా, పడకగదికిపోవడానికిచ్చపడక పచార్లు చేస్తూంటాడు. ఎన్నిమార్లో తలనొప్పితో బాధపడుతూన్నప్పుడు మణివచ్చి తనకు వుపచారంచేస్తుందా అని వాపోతూంటాడు. ఆసమయాల్లో మణి సినిమాకు వెళ్లుటకు తయారవుతూంటుంది గాని, అతన్నిగురించిన తలపేలేదు. మాక్షీకితప్ప అతని మనస్సులోని వేదన మరియొకరికి తెలీదు.

ఇన్నిదినములుగా దేనికై వేచియున్నాడో అది చేతికి లభించిందికదా, తనకోర్కె ఫలించిందికదా అని జ్యోతిష్ సంతోషించాడు. తనహృదయములో మణియొక్క రూపము, ప్రేమతో పూజ్యతతో ముద్రించుకున్నాడు.

మాక్షీ మరల జ్యోతిని నిద్రపోతున్నాడని అనుకుంది. గాని, అతను తిరిగి ప్రారంభించాడు.

'నేను మణితో కూడా సంతోషముగా వుండలేదని మణి నన్ను సంతోషపెట్టలేదని, నీకు మణిమీద కోపమువచ్చిందని నాకు తెలుసు కానీ, మాక్షీ, సుఖము లనేవి ఆనక్షత్రాలలావుంటాయి. అవి చీకటినంతనీ పోగొట్టలేవు, నడుమనడుమ వదలివేస్తూవుంటాయి. అట్లానే మనము జీవితములో ఎన్నోతప్పులు చేస్తాము. మనకు తెలియకుండానే నడుమనడుమ ఒకప్పుడు దానిలోనుండి నిజము ప్రకాశిస్తూవుంటుంది. అప్పుడు మనము యిదిమంచిది, యిదిచెడ్డదిఅని తెలుసుకో గలుగుతాము. నాకీదినము ఈఆనందమెక్కడనుండి వస్తోందో తెలియదు. సంతోషముతో నాహృదయం నిండింది.'

మాక్షీ మెల్లగా అతనితల తడుముచు ఆచీకటిలో కన్నీరు కార్చింది.

'మాక్షీ, మణి యింతవయసులో వున్నప్పుడే నేను ......'

'చిన్నవయసా! నేను నాప్రాణప్రతిమను పోగొట్టు కున్నపు డిల్లాగే చిన్నదాన్ని. అయినప్పటికి నాహృద యంలో సర్వదాస్థాపించి పూజిస్తున్నాను. ఇది యెంత ఎడబాటనుకుంటావా? దీనికన్న సంతోషం, మనజీవితానికి అత్యంత అధికమైనది కాదు.'

'మాక్షీ, మణియొక్క హృదయము మేలుకొనే సమయంలో నేను వెళ్లిపోతున్నాను.'

'నీవు దానినిగురించి ఏమి చింతపడవద్దు. మణి యొక్క మనసు మేలుకొంది. అదిచాలదూ?'

ఆసమయంలో జ్యోతికి యిదివరకెప్పుడో విన్నపాట ఒకటి స్మరణకువచ్చింది 'ఓహృదయమా, నీవు ప్రేమించినపురుషుడు యింటివాకిటకు వచ్చి నప్పుడు నీవు మేలుకోలేదు, అతడు మరలిపోతూంటే ఆపదశబ్దమువిని మేలుకొన్నావు. అంధకారములో మేలుకున్నావు' ఆనేభావంగల ఆపాట యీతని చెవుల్లో ప్రోగింది.

'మాక్షీ యిప్పుడు గంటఎంత?'

'గంట తొమ్మిదయింది.'

'అంతేనా, నేను రెండో మూడో అనుకున్నాను. నాకు తెలుసునాను అర్ధరాత్రిఅయింది. అయితే నన్ను అప్పుడే ఎందుకు పండుకోమన్నావు?'

'నీవు నిన్న ఎంతసేపు మాట్లాడుతూ మేలు కున్నావో నీకు తెలియదూ? అందుకు ఈవేళ కొంచెం ముందుగా పండుకుంటే మంచిదని పడుకో మన్నాను.'

'మణి నిద్రపోతూవుందా?'

'లేదు నీకు ఆహారము తయారుచేస్తోంది'

'ఆ! తానే చేస్తూవుందా? నిజంగానే?'

'అవును నీకిచ్చేఆహారమంతా తానే స్వంతంగా చేస్తూవుంటుంది.'

'అలాగా? మణికి వంటరాదనుకున్నా.'

'ఆడవాండ్లకు వంటచేయ్యటోవడం ఎంతసేపు? సమయము వచ్చినప్పుడు దానంతటదే వస్తుంది.'

'నేను ఇందాకా తిన్నఫలంకు చాలా రుచిగా వుంది. నీవే దానిని చేశావనుకున్నాను'

'అయ్యో నేను కాదు. నన్ను ఏదైనా చేయనిస్తుం దనుకున్నావా? నీపనంతా ఆమెనే చేస్తుంది. నీబట్టలుకూడా ఆమే వుతుకుతుంది. నీకెక్కడా మురికిలేకుండా శుభ్రముగా వుండవలెనని ఆమెకు తెలుసు. నీవుగనుక నీకూర్చునేగదిలోకి వెళ్లి చూస్తే ఏమనుకుంటావో. అది అంతశుభ్రముగావుంచింది. నేను మణినిగనుక నీవుండేగదిలో తిరుగనిచ్చావంటే యింక ఆలసిపోయేంతవరకు తిరుగుతూనే వుంటుంది. అందుకనే, నేను పోవద్దంటాను. అయితే ఆమెకు రావాలని, చేయాలని కోరిక'

'మణికి వంట్లో బాగుండికదా మాక్షీ'

'ఆమెను నీజబ్బుగదిలోకి తరుచు పోగూడదని, అర్భకురాలని డాక్టరు చెప్పినాడు'

'మాక్షీ నీవు దానిని ఎట్లా రానియ్యకుండా తేన్నావు?'

'నేను ఎట్లాచెపితే అట్లా వింటుంది. అయితే, అప్పటికప్పుడు నీవంటిస్థితినిగూర్చి యీమె తో చెప్పుతూండాలి.'

నక్షత్రాలు ఆకాశంలో కన్నీటిబిందువుల్లా మెఱుస్తున్నాయి. జ్యోతిష్ తనయొక్క అంతరించబోయే జీవితానికి కృతజ్ఞతాపూర్వకముగా నమస్కరించేడు. మృత్యుదేవతకు అతివిశ్వాసముతో కుడి చేయి చాచాడు.

జ్యోతిష్ ఓపికలేనట్లు యొక నిట్టూర్పువిడ్చి 'మాక్షీ మణి యింకా నిద్రపోకుండావుంటే ఒక్కసారి యిక్కడికి రమ్మను, అయిదునిముషాలే వుంచుతాను. చాలాసేపు వద్దు. నేను వోవిషయం ప్రత్యేకంగా ఆమెతో చెప్పాలి.'

మణినిపిలవడానికి మాక్షీ బయటికివెళ్లింది.

అప్పుడు జ్యోతిష్‌యొక్క నాడి వేగంగా కొట్టుకోవడం మొదలెట్టింది. ఇదివరకెన్నడూ మణితో తన మనసువిప్పి మాట్లాడలేదు. మణివస్తే ఏమి మాట్లాడవలెనా అని యోచించాడు. ఈఅయిదు నిముషములైనా వృథాపోనివ్వకూడ దనుకున్నాడు.

... ... ...

'ఇదేమిటమ్మా ఎక్కడికి వెళ్లడంలేదుకదా?'

'అవును వెళ్లుతున్నాను శీతారామపురానికి'

'ఎవరు నిన్ను తీసికొనిపోతారు?'

'అనంతు......'

'ఈవేళ కాదు మణీయొకదినం పోదువుగానిలే.'

'అంతా సిద్ధమయింది. కంపార్టుమెంటుకూడా రిజర్వుచేశాడు'

'అయితేనేమి పరవాలేదు. యీదినం మంచిది కూడాకాదు. రేపుతెల్లవారి బయుద్దేరివెళ్లు'

'మాక్షీ నీకంతా యివేళకపిచ్చి, దినంబాగులేదు యిది బాగాలేదదిబాగా లేదని.ఏమవుతుంది నేనీవేళ వెళ్లిపోతే?'

'ఈవేళ జ్యోతిష్ నీతో మాట్లాడవలెనని నిన్ను రమ్మన్నాడు'

'సరే అయితే యింకా కొంచెం వ్యవధివుంది, పోయి చూచివస్తాను'

'నీవుమాత్రం వూరికి వెళ్లుతున్నావని ఆకనితో చెప్పకూడదు'

'నేనుచెప్పను. అయితే చాలసేపు నేనుండటానికి వీలులేదు. రేపు నాచెల్లెలికి అన్నప్రాసన గనుక ఈవేళనే పోవాలి'

'మణీ,ఈఒక్కసారి నేనుచెప్పినట్లు విను. నీమనసు కొంచెం స్థిమితముచేసుకుని అతనిప్రక్కన కొంతసేపు కూర్చుని మాట్లాడిరా. నీతొందరపాటును అతనికి కనపడనీవద్దు'

'నేనేమిచేయను? నాకోటను రైలు కాచుకొని వుంటుందా? ఇంక పదినిమిషాలకు అనంతువస్తాడు. అంతవఱకు ఆయనదగ్గర కూర్చోగలను'

'వద్దు. అయితే పోనేవద్దు. ఈతొందరపాటులో జ్యోతిష్‌దగ్గరకు నేను పోనియ్యను. ఓకఠినాత్మురాలా! నీవు ఇప్పుడు బాధించే నీమగడు త్వరలో ఈప్రపంచాన్ని విడిచిపోబోతున్నాడు. ఇదిగో నేను చెప్పుతున్నాను. నీవు నీపాపవజ్జీవము యీరోజును ఎన్నటికిని మరువలేవు. నీకు యిప్పుడు తెలియక పోయినా దేవుడొకడున్నాడని ఒకప్పటికైనా తెలుసుకోకపోవు'

'మాక్షీ నీవు అట్లా నన్ను శపించకూడదు'

'ఓ జ్యోతిష్! నానాయనా! నీవింకా ఎందుకిన్నాళ్లు బ్రతికివున్నావు? నీభార్య చేయుచేతల

కష్టులేకుండావుంది. ఈపాపాని కంత్యం లేకుండా వుంది. ఈకఠినాత్మురాలి మనసెప్పుడు కరుగుతుందో కదా ?’ అని వెక్కి వెక్కి ఏడ్చింది మాక్షీ.

... ... ...

మాక్షీ కొంతసేపయినతరువాత జ్యోతిష్ నిద్ర పోతూంటాడనితలచి అక్కడికి వెళ్లింది. గాని ఆమె రావడంతోటే జ్యోతిష్ కదలడం మొదలెట్టేడు.

‘మణి ఏమిచేసిందో చూడు’

‘ఏమిజరిగింది ? మణిరాలేదా ? ఇంతఆలస్య మైందేమి ?’

‘నేనక్కడికి వెళ్లేటప్పటికి మణి వెక్కి వెక్కి ఏడుస్తూవుంది. ఎందుకంటే, నీకోసరం గంజి చేస్తుంటే అది అడుగు మాడిపోయిందట. తను నీకోసరం చేసింది అంత అజాగ్రత్తగా మాడ్చేసినాకే అని ఆమెకు కష్టంగావుందిట. నేనుఓదార్చి పడుకోమని చెప్పివచ్చినాను. అందుకనే యిక్కడికి పిల్చుకొని రాలేదు.’

జ్యోతిష్‌కు మణిరాలేదని మనసుకు కష్టముగా వున్నప్పటికీ తనకిచ్చేఆహారము పాడుచేసినందువల్ల మనసు నొచ్చుకుంటున్నదే అని చాలాసంతసించాడు.

‘మాక్షీ’

‘ఏమి బాబా’

‘నాకు అంత్యకాలము సమీపిస్తున్నదని బాగా తెలుసునుగాని నాకే చింతాలేదు. నాకోసం నీవు వ్యసనపడకు’

‘లేదునాయనా, వ్యసపడను. నేను బ్రతికియుం డుట మంచిది, చావు మంచిదికాదని ఎప్పుడు అను కోను. మనమీప్రపంచములో ఎన్నాళ్లు వుండవలెనో అన్నాళ్లు కష్టసుఖములు మనకర్మప్రకారము అనుభ వించిపోతాము. అంతే.’

‘నిజముగా చావు అతి ఆనందకరమయినదే’

జ్యోతిష్ ఆకాశమువంక తేరిపారజూచి మణి తనవంకకు మృత్యుదేవతవలె వస్తున్నట్లు ఊహిం చాడు. కొంచెంసేపుండి జ్యోతిష్ అన్నాడు:

‘మాక్షీ ఈరెండురోజులనుంచి నేను మణిని చూడనేలేదే’

‘ఇంకోదిండియ్యనా ఆనుకోటానికి? జ్యోతిష్ కొంచెం పండురసంత్రాగు నీగొంతెండిపోయి వుంటుంది’

‘నిన్న వీలుపత్రం వ్రాసినాను, నీకు చూపిం చానా?’

‘నాకు చూపించనవసరములేదులే జ్యోతిష్’

‘నాతల్లి చనిపోయినప్పుడు నాకేమీ లేదుకదా. అంతా నీవే—నన్ను పెంచి పెద్దచేసినావు’

‘ఈఇల్లు కొంచెము సొమ్ము తప్ప అంతా నీవు సంపాదించినదేకదా జ్యోతిష్’

‘అయితే యీఇల్లొకటీ చాలదా ?’

‘దీనినంతా క్రొత్తగా మార్పుచేసి కట్టించినది నీవే కాదూ’

‘మణికి నీమీద చాలా ఆశఅని నమ్ముతాను’

‘ఔనౌను. అది నాకుతెలుసును. నీవు కొంచెం విశ్రాంతితీసుకో’

‘నాఆస్తిఅంతా మణికి వ్రాసియిచ్చాను. కానీ అంతా నీదేఅనుకో మాక్షీ. మణి నీమాట త్రోసి వేయదు’

‘దానినిగురించి నీకిప్పు డెందుకింతచింత ?’

‘నాకున్నదంతా నీదే. నీఋణము తీర్చుకోలేను. నావీలుపత్రముచూచి మరోకలాగు అనుకోకుమాక్షీ’

‘జ్యోతిష్ ! బాగావుంది. నీఆస్తి మణికిస్తే నేనే మైనా అనుకుంటాననా ? నేనంత తెలివిమాలినదా న్ననుకున్నావా ? నాసంగతి నీకుతెలియదా ?’

‘నీకుకూడా...’

'మాక్షీ, మణి కల్లదం రాదనుకున్నాను. దాని కల్లదం అంటే యిష్టంలేదు కదూ ?'

'మనమ్మంటే ఏదైనా తేర్చుకోవడం ఎంతసేపు? నేనే నేర్పించాను. అయితే చాలా తప్పులున్నాయిం దులో'

'తప్పులుంటే సేమిలే. మనమేమి దీన్ని పత్రికకు ప్రదర్శనానికి పంపించం కదా ? నా కాళ్లు నెప్పిగా కప్పు కోడానికి ఇది చాలదూ ?' ఆ శాలువను తనచేత్తో మెల్లగా తడుముతూ, మణి అది అల్లడానికి ఎంత ప్రయాసపడిందో అని ఊహించాడు.

'మాక్షీ, క్రింద డాక్టరున్నాడా'?

'అవును అతడు నీ గాత్రి యిక్కడే వుంటాడు'

'నాకు నిద్రపోయేందుకు మందు యివ్వవద్దని అత నితో చెప్పు. దానివల్ల నాకు నిజమైన విశ్రాంతిలేదు; పైగా నా బాధ ఎక్కువచేస్తుంటే గాని తగ్గించదు. నన్ను మేలుకొనే వుండనీ మాక్షీ. నా పెండ్లి శ్రావణ మాసంలో పున్నమనాడురాత్రి కదా అయింది? నీకు జ్ఞాపకముందో లేదో, నేను జ్ఞాపక పరుస్తాను. ఈ వేళ మణిని రెండునిముషములు యిక్కడికి పంపిస్తావా? ఏమి పలుకవు? నా కేమాత్రమైనా వుద్రేకం పనికి రాదని డాక్టర్ చెప్పినాడా ఏమి ? పరవాలేదులే, ఈ వేళ గనుక మణితో రెండునిముషములు మాట్లా డితే, అదే నాకు మందుగాని ఏదీ వద్దు. నాకి సంతోషమే చాలు.........మాక్షీ యెందుకలా ఏడుస్తావు? నా కేమీ పరవాలేదు. ఈ వేళ నా హృదయం ఆనందంతో నిండివుంది. అందుకనే మణిని చూడవలెనంటున్నాను......వద్దు, వద్దు మాక్షీ నీ వేడిస్తే యింక నేను చూడలేను. ఈ నాలుగురోజు లుగ నీ వేమీ పలకకుండా వున్నావు. ఈ వేళ యెందు కేడుస్తున్నావు ?

"జ్యోతిష్, దుఃఖించి, దుఃఖించి నా కళ్లల్లో నీళ్లన్నీ అయిపోయా యనుకున్నాను గాని యింకా చాలా వున్నాయి. ఇక నేను సహించలేను బాబా నేనేం చేయను ?'

'మాక్షీ నీవు విచారపడవద్దు. నేను చూడలేకుండా వున్నాను. మణిని పిలు! మా పెండ్లిదినం జ్ఞాపకం చేయ్యాలి'

'నేను పోతున్నాను బాబా నీ కేమైనా కావా లంటే, పాంథు యిక్కడనే వుంటాడు పిలు'

మాక్షీ మణిగదిలోనికి పోయింది ఏడుస్తూ.

జ్యోతిష్ ఎవరో వస్తూన్న పదశబ్దము విని ఆతురతగా 'మణీ' అని కేక వేశాడు.

'నేను పాంథుని బాబూ, నన్ను పిలిచారా, అయ్యా ?'

'మీ యజమానురాలిని పిలు'

'ఎవరినయ్యా ?'

'అమ్మగారిని'

'అమ్మగారింకా రాలేదండీ.'

'రాలేదా ! ఎక్కడినుంచి?'

'సీతారామపురంనుండి'

'ఎప్పుడు వెళ్లారు ?'

'మూడురోజు లయింది.'

ఒకక్షణం జ్యోతిష్ దేహమంతా, చలనములేక తిమ్మిరిపట్టినట్లైపోయింది. తను ఆనుకొనివున్న దిండు మీదనుండి క్రిందకు జారిపోయాడు. కాళ్లమీద వున్న శాలువను దూరముగా త్రోసేశాడు. చాలా సేపటికి మాక్షీ జ్యోతిష్ దగ్గరకు వచ్చింది. అతను మణినిగురించి మళ్లీ అడగనేలేదు. మఱచిపోయి నాడు కదా అనుకొంది మాక్షీ.

'మాక్షీ నిన్న నాకు వచ్చినకల చెప్పానా నీతో?'

ఏమి కల ?'

'మణి నా గదిలోకి రావడానికి ప్రయత్నిస్తూ న్నట్లు, తలుపు ఎంతకు తెఱచుకోనట్లు, ఇప్పుడు

నాకు తెలిసింది, కడాపటివరకు మణి నా దగ్గరకు రాక బైటనే వుంటుంది'

మాక్షీ ఐకేలు చెప్పలేదు తాను కల్పించిన భావనా స్వర్గమంతా తల్లక్రిందులైందని తెలుసుకొంది. దైవ సంకల్పమును మన మర్దగించలేము కదా అనుకొంది.

‘మాక్షీ నీవు నాయందు వుంచిన ప్రేమ జన్మ జన్మానికి తరగదు. నేను నాతో తీసుకొనిపోవుటకు నా ప్రాణము నీ యొక్క మాతృప్రేమతో నింపివుంచుకున్నాను. వచ్చే జన్మలో నీవు నాకూతురిగా పుడుతావు అప్పుడు నేను అసమానమైన ప్రేమతో నిన్ను పెంచుతాను'

‘ఏమి? మళ్లీ ఆడపిల్లగానే పుట్టమంటావా, కొడుకుగా పుట్టాలని ఎందుకు ప్రార్థించకూడదూ?'

‘ఊహూం! కొడుకుగా వద్దు, నీవు నీ చిన్నతనంలో వున్న సౌందర్యముతో నాయింటికి రావాలి. అప్పుడెట్లా శృంగారిస్తా వనుకున్నావు?'

‘ఇంక ఎక్కువ మాట్లాడవద్దు జ్యోతిష్. పడుకో'

‘నీకు ‘లక్ష్మి' అని పేరుపెడుతాను.'

‘అది చాలా పాతకాలపు పేరు'

‘అవును నీవు పూర్వకాలపు మాక్షీవి. నువ్వు నీ చక్కని పూర్వకాలపు నడతలతోనే నా యింటికి రావాలి'

‘నేను నీ యింటికి దురదృష్టమైన యీ ఆడపుట్టుకతో వచ్చి, నీమీద భారంవేయడానికి నాకిష్టంలేదు'

‘మాక్షీ నీవు నన్ను బలహీనురాలనని, అన్ని కష్టముల నుంచీ దూరం చేయాలని అనుకుంటున్నావు'

‘నాయనా! నేను స్త్రీని. స్త్రీకి సహజమైన ప్రేమతో నీకు ఏ కష్టములు రాకుండా కాపాడాలని, ప్రయత్నించాను గాని, అది నా తరమా?'

‘మాక్షీ! నే నీ జీవితములో నేర్చుకున్న పాఠాన్ని నిదర్శనంగా చూపడానికి తేలేదు గాని నాకై జన్మకై నా పనికివస్తుంది. అప్పుడు పురుషు డేంచేయ గలడో చూపించగలను. నాకు నాయొక్క సంతోషానికై పాటుపడటం కపటం, స్వలాభాపేక్ష కాకూడదు?'

‘బాబా, నీ వెంత చెప్పినా సరే, నీ వందుకి అంతా యిచ్చినావే గాని, నీవు నీ స్వంతమునకై ఒకటి అనుభవించలేదు'

‘నన్నుగురించి ఒకవిషయంలో మాత్రం సంతోషపడుతాను. ఏమంటే నా ఆనందములో ఏ కార్యము తొందరపడి చేయలేదు. బలవంతముగా ఒకటీ నేను చేయించనూ లేదు. ఎందుకంటే అసత్యం నన్ను స్పృష్టిపరచలేదు. కాబట్టి నేనింకా కాచుకొని వుండవలసివచ్చింది. ఐనాకిః సత్యమే ఆఖరుకి నాకులాభకారిగా వుంటుందేమో? ఆ వచ్చే వారెవరు మాక్షీ?'

మాక్షీ ఆ ప్రక్కగదిలోకి పోయి చూచివచ్చింది.

‘ఎవరులేరు జ్యోతిష్, పూరికే వుండు. అదుగో డాక్టరు వస్తున్నాడు'

డాక్టర్:- మీరు జబ్బుమనిషిదగ్గర వుండకూడదు. ఆయనను పూరికే కలతపెట్టుతారు. ఇతను నా అసిస్టెంటు. ఇత నిక్కడుంటాడు. మీరు వెళ్లి విశ్రాంతి తీసుకోండమ్మా కొంతసేపు'

‘మాక్షీ నీవు పోవద్దు. నేను నిన్ను పోనియ్యను'

‘సరే బాబా నేనామూల కూర్చునివుంటాను, నీవు పండుకో'

‘వద్దు నీవు నా ప్రక్కనే కూర్చోవాలి. నీచెయ్యి నేను ఆఖరివరకు వదలను. నేను నీ చేతిమీదుగానే పెరిగాను. నీచేతుల్లో నుంచే దేవుడు నన్ను తీసుకొని పోవాలి'

‘సరే అయితే మీ రిక్కడే వుండండి. అయితే మాత్రం మాట్లాడించవద్దు. జ్యోతిష్ బాబూ! నీవు మందు తీసుకునే వేళయింది.'

‘నాకా? మందుకు వేళయిందా? మందులకు వేళ ఎప్పుడో అయిపోయింది. ఇంకా మందు యివ్వడం నన్ను ఏమార్చడమే. నాకు చావంటే భయం లేనే లేదు మాక్షీ! ఆ డాక్టరును పంపించై. నాకు నీవు తప్ప ఎవరు అక్కరలేదు. ఏదీ అక్కరలేదు.’

‘నేను డాక్టరును గనుక చెపుతున్నాను. ఈ గడబిడంతా నీకు హాని చేస్తుంది జ్యోతిరా బాబూ’

‘అట్లయితే నీ వింక పో డాక్టర్! నీవుండి యింకా నన్ను తొందర చేయవద్దు. మాక్షీ! పెళ్లి కాదా లేదా? ఆ! పెళ్లి కాదా? నీ వింకరా, నా తల నీ వొళ్లో పెట్టుకో…’

‘అట్లనే జ్యోతిరా నీ వింక నిద్రపోవూ?’

‘మాక్షీ నన్ను నిద్రపొమ్మని చెప్పవద్దు. నేను నిద్ర పోతే మరి లేవను. నే నింకా కొంచెంసేపు మేలు కొని వుండాలి. నీకు శబ్దం వినపడుతూ వుందా? ఎవరో వచ్చేటట్లు వుందే?

‘జ్యోతిరా ఒక్కసారి కండ్లు తెఱచిచూడు, మణి వచ్చింది’

‘ఎవరు వచ్చింది? కలా?’

‘కలగాదు బాబూ, మణివాళ్ల తండ్రితోకూడా వచ్చింది’

‘ఎవరు నీవు?’

‘నీకు తెలీదా అది మణి’

‘మణీ! ఆ తలుపు తెఱచుకుందా?’

‘అవును బాబా ఆ తలుపుమాడు బార్లా తెఱచి వుంది.’

‘కాదు మాక్షీ—ఆ కాలువకాదు. అదంతా పట్టి కల్ల’

‘అది కాలువకాదు జ్యోతిరా—అది మణి నీ కాళ్ల మీద పడివుంది. నీ చెయ్యి మణి తలపైన పెట్టి ఆశీ ర్వాదం చెయ్యి బాబా. మణీ, అట్లా ఏడువకు యిప్పటినుంచీ. యింకా దానికి వేళవుందిలే. కొంత సేపు వూరుకో……’

(రవీంద్రుని ఆంగ్లకథనుండి)

# మా చింతగింజల దీక్ష

చి॥ పద్మసుగంధ రాజవల్లి

తెలతెల్లవారుతూవుంది. మా శేషు, రమణ లేచి, చిలుకపలుకు లాడుతున్నారు. నేను కలతనిద్రపోతున్నాను. బాగా తెల్లవారింది. పనివాళ్లు ఎవరిపనులు వాళ్లు చూచుకుంటున్నారు. నేను లేచి, పెరట్లోకి వెళ్లి ముఖము కడుక్కుందామని అరుగుమీద కూర్చున్నాను. ప్రక్కన సుబ్బిగాడు చెంబులకు చింతపండు పూస్తున్నాడు. పండంతా పిప్పిఅయిపోయింది. గింజ బైట పడింది. ఆ గింజలు చూడగానే నాకు అదోక విధమైన ఆనందం పొంగిపొర్లింది. త్వరగా దంతధావన ముగించి, ఆ గింజలన్ని పొల్చి, కడిగి ఎండవేసి ఇంట్లోకి వెళ్లి దాచుకోడానికి డబ్బా వెతుకుతున్నా. ఇంతలో మా అమ్మ పిలుపు... నేపలకలే. తిరిగి కబురు...

అన్నం తింటే ఆలస్యమౌతుందని పణకు నటిస్తూ మా అమ్మదగ్గరకు వెళ్లి, 'చలేస్తోందే అమ్మా అన్నం తిన' నన్నా మాఅమ్మ నవ్వు చూచి, పోనీ కాఫీత్రాగమని ఒకకప్పు కాఫీ అందించింది. కాఫీ పుచ్చుకొని, దొడ్లోకివెళ్లి, ఎండలో గింజలు ఎత్తి ఒక మూట కట్టి మా ఇంటిదొడ్లో వున్న తోటలోకి వెళ్లి అక్కడ గట్టుమీద కూర్చుని, లెక్కపెట్టడం ఆరంభించా. నాలుగుకచ్చటాల గింజలైనవి. నేను కూర్చున్న అరుగుకు నాలుగైదుగజముల దూరంలో ఒక చిన్నపిట్టగోడ ఉంది. దాని ప్రక్కనే, నా ప్రాణస్నేహిత 'పద్మ' ఇల్లు. పద్మను కేకవేసి నేను ప్రొద్దునుండీ చేసిన యత్నమంతా చెప్పా. పద్మ తనవిశాలమైన కండ్లల్లో ఆశ్చర్యమును సూచించి, ఏదో ఆలోచించినట్లు నటించి 'ఊ'...అన్నది. పద్మకు దూరాలోచన ఎక్కువ. నే నది గ్రహించి ఏమిటి పద్మా ఆఆలోచన అన్నాను. 'నీవు ప్రోగుచేసిన గింజలు ఆటపట్టుకే సరిపోవు. మునుపు నా దగ్గర చాల గింజలుండేవి. అ సత్తమానూ ఆడుతోవుంటే మా అమ్మమ్మ తీసి చెంబులోపోసి, సామాను అరలో పడేసినట్లు జ్ఞాపకం' అన్నది. నాకు మరింత ఆనందం హెచ్చయింది. పద్మ, నేను వాళ్లింటికి వెళ్లి గింజలు వెతకగా దొరికాయి. అవి లెఖపెడితే రెండు ఏనుగుల మూడుగుఱ్ఱముల నాలుగు కచ్చట్లున్నాయి. అవి చూచి నాకు వెఱ్ఱానందంవచ్చి పద్మభుజాలమీద చెయ్యివేసి, 'పద్మా! మన మిన్నిగింజలు గుప్పగలమా?' అన్నాను.'ఏమిటమ్మా! మనమిద్దరమే గుప్పుతామా ఏమిటీ, కమల, సుశీల, విజయలక్ష్మి, సుందరం వీళ్లందరూ లేరూ' అన్నది. 'సరే' అని నేనా గింజలన్నీ బుట్లకెత్తి చంకన బెట్టుకొని, పద్మా నేనూ జట్టాపట్టాలు

వేసుకొని మా ఇంటికి దారిపట్టేం. గుమ్మంలోకి వెళ్లేటప్పటికి, పదకొండు కొట్టింది. నాన్నగారు కచ్చేరీకి వెళ్లిపోయారు.

మా అమ్మ భోంచేస్తోంది. నేను, పద్మ మా చిన్నన్న పుస్తకాలఅర ప్రక్కనవున్న పెట్టెలో ఆ బుట్టను జాగ్రత్తచేసికొని, మా అమ్మ దగ్గరకు వెళ్లేం. మా అమ్మ శాంతంగానే ఉన్నది. మంగళహారతు లేమీ తగలలేదు ఎందుచేతనో. కారణం నే నూహించాను, బహుశః రాం మామయ్య పెండ్లి విషయమై ఉత్తరం వచ్చిఉంటుందని. అమ్మ భోజనం ముగిసింది. నా ఊహ నిజమైంది. నాకు అన్నంపెట్టింది; బంగాళాదుంపలకూర చాల రుచిగా ఉంది. పద్మ నా కెదురుగా కూర్చున్నది. 'పద్మా! నీవీవేళ నాతో భోంచేస్తే చాలా సంతోషం' అన్నాను. పద్మ చిరునవ్వు నవ్వింది. తిరిగి అడిగా, తొమ్మిదింటికే తిన్నా నన్నది. మా అమ్మ గూడా పట్టుపట్టడంచేత పద్మ 'ఊ' అన్నది. మే మిద్దరము భోజనంచేసి, స్నేహ బృందాన్ని పిల్చుకొనివచ్చి, వెనక చావిడీలో మకాంవేసేం. కమల పట్టుపట్టింది, పట్టుపోయింది. పట్టుపోయిందని, 'ముఖ్యముగా మూడుసార్లుపట్టాలి, ఇది దేముడిది, రెండవది దయ్యం, మూడవది భూతం, నాల్గోది నిజం'అని చిన్నపట్టుపట్టింది, అదీపోయింది. కమల వినుగుతో లక్ష్మిచేతిలో పోసింది. లక్ష్మికి చేతికాయపడింది. వెంటనే లక్ష్మి 'చేతులోకాయ నూతులో'' అని కేక వేసింది. 'అదేమన్నమాట, చేతికాయలు లేవు అట ఇమ్మ'ని బలవంతంగా పుచ్చుకుంది సుందరం.

పోసినగింజలన్నీ గుప్పడమయింది, ఆట పట్టుకు అందరంతలో రెండుగుజ్జాలూ పోసుకున్నాం. నేను విజయసుందరం నాలుగేసి కచ్చట్లు గెలుపుతీసేం. కొంతసేపు ఆటజరిగింది. కొందరు అపజయం పొందేరు. ఇంతలో మా రమణ శేషువచ్చి గింజలిమ్మని గల్లంతుచేయడం ఆరంభించారు. నాకు చాలాకోపంవచ్చి, రెండుకొట్టి అవతలకు సాగనంపి తలుపు ఘడియవేశా. వాళ్లిద్దరు మా అమ్మను తీసికొచ్చారు. మా అమ్మ తలుపుకొట్టింది. మాకు చాలా భయము వేసి తలుపుతీసేశాం. 'చెల్లెళ్లకు గింజలిస్తారా? ఎత్తి అవతల పారవెయ్యనా'అని ఝుడిపించి, ఇద్దరికీ చెరోగుప్పెడు గింజ లిప్పించింది. ఇంతలో మా చిన్నన్న వచ్చి చదువూ సంధ్యలు లేవు, ప్రైవేటుమాష్టారు వచ్చారు నడూ అంటూ గింజలన్నీ చెల్లాచెదర చేశాడు. నా హృదయం కోపంతో నిండిపోయింది. అందరూ వెళ్లిపోయారు. పద్మా నేను గింజలన్నీ ప్రోగుచేసికొని దాచుకున్నాం. పద్మ ఇంటికెళ్లిపోయింది. సాయంత్రం ఐదు కొట్టింది. నేను ప్రైవేటు చదువుకున్నా. నాన్నగారు వచ్చారు. చిన్నన్న నెలాగైనా కొట్టించాలనుకున్నా. ఎట్లాగైతేనేం వాడిని కొట్టించి మరీనిద్రపోయా. ఆరాత్రంతా చింత గింజల ఆటనుగురించిన కలలే, ఆ కలవరింతలే.

శ్రీ గాలి పెంచల నరసింహారావుగారు
మ్యూజికల్ డైరెక్టర్

## కామవర్ధని - ఆదితాళము

51-వ మేళకర్త

ఆరోహణ : సరిగమపదనిస { స రి X మ ప ద ని స }
అవరోహణ : సనిదపమగరిస { ,, శు అం ప్ర శు కా ,, }

సంపూర్ణ సంపూర్ణము

ప్రేలికి నాలుగుఅక్షరముల చొప్పున ఘాతనుండి రెండుఅక్షరములు త్రోసి పాడుకొనవలయును

పల్లవి. పంకజనయనా! పరమపావనా!
సంకటహారణ! శ్రీ వేంకటరమణా॥ పంక॥

అనుపల్లవి. భక్తజనావనా! భవభయహరణా!
ముక్తిప్రదాన! సద్భక్తినిదానా! పంక॥

చరణము. పాపసంఘ సంతాపాగ్నిలోబడి
పరమాత్మ నిన్ మనసార నుతింపక
దురితాత్ములగూడి దుశ్చరితుడనై
పరుషములాడితి పాలింపవెనను॥ పంక॥

పల్లవి :

| | | |
|---|---|---|
| ,, : పా,మగరి సారీసా,, | ,, గమాపపా | ,, పమపమదరి |
| ,, : పం,కజఅనయనా,, | ,, పరమపా | ,, వఅఅనఅఅ |
| గమ : పా,మగరిపఃగరిపా ,, | ,, గమాపపా | దనిదమపమగరి |
| అఅ : పం,కజఅనఅయఅనా,, | ,, పరమపా | అఅవఅఅనఅఅ |
| గమ : పా,మగరి పరిపమగరిపా | ,, పసాసనా | సనిదాపమగరి |
| అఅ : పం,కజఅనఅయఅనఅఅ | ,, పరమపా | అఅవఅనఅఅ |
| గమ : మదమగరిగమాపమగరిపమగరి | సాససాససా | గరిసని దనినిద |
| అఅ : పంంకజఅనఅఅఅయఅనఅఅఅ | అపరమపా | అఅవఅనఅఅఅ |



శ్రీమతి ఆర్. కమలాబాయిగారు



శ్రీమతి రాణి లక్ష్మీబాయి
రాజ్వాడిగారు
ఢిల్లీలో జరిగిన అఖిలభారత మహిళా
సభకు అధ్యక్షత వహించిరి.





మిస్. మేరీ డింగ్‌మన్‌గారు
అంతర్జాతీయ స్త్రీల శాంతిసంఘమునకు
అధ్యక్షురాలు. ఢిల్లీలో జరిగిన అఖిల
భారత మహిళాసభకు హాజరై, ప్రస్తు
తము భారతదేశమున సంచారము
చేయుచున్నారు.




శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయగారు
భారత మహిళాసంఘ ఉపాధ్యక్షురాలు.
డెన్మార్కు దేశపు కోపెన్‌హాగన్ పట్టణమున
జరుగబోవు అంతర్జాతీయ మహిళాసభకు భార
తీయ ప్రతినిధి. పై మహాసభ సమానస్వత్వము
లక్ష్యకృషి చేయు స్త్రీల సంఘంతరపున జరుగును.



కుమారి టి. అన్నపూర్ణ
గడచిన డిశంబరు మాసమందు అఖిల బంగాళా
పాఠశాలల సంగీత పోటి పరీక్షయందును,
సంగీతపరిషత్తు పోటీలయందును, గాత్రపాటకు,
సితార వాయిద్యమునకును ప్రథమ బహుమ
తులు పొందిన ఆంధ్రబాలిక.

# సహవిద్య

శ్రీ బి. రంగనాథ్ గారు

సహవిద్యనుగురించి వ్రాయుటకుముందు విద్యయనగా నెట్టిది, మానవజీవితమున కది యెంతవరకు తోడ్పడగలదు, నారీజాతికి దానితో నెంతవరకు సంబంధముగలదను విషయములనుగురించి మనము కొంచెము పరిశీలింపవలసియున్నది.

విద్యయనగా మానవజాతికి కర్తవ్యముల నుపదేశించి, దేశకాల పాత్రోచిత జ్ఞానమును ప్రసాదించి మానవశబ్దమును సార్థకమొనరించు అమూల్యవస్తువు. కావుననే ఒక ఆంగ్లేయుడు విద్యా స్వరూపము నిట్లు వాకొనినాడు.

**Education does not mean to know what we do not know, but it means to know what we ought to know.**

మన హృదయశక్తిని మన స్వాతంత్ర్య జ్యోతిని మన ఆత్మగౌరవమును ధ్వంస మొనరించు విద్య విద్యగాజాలదు. బ్రహ్మచర్యముబూని సత్యపదార్థ స్వరూపము నెరింగి సాధించు విద్యయే విద్య. అట్టి మేటివిద్యను సాధించిన భారత నారీమణి యొడిలో బెరుగుటవలననే శ్రీరామ కృష్ణాదులు ప్రపంచమున కాదర్శ పురుషులు కాగలిగిరి. శివాజీ ప్రతాపులు వీరాధి వీరులైరి. కావున నిందువలన స్త్రీజాతికి యుత్తమ విద్య అత్యవసరమని వెల్లడియగుచున్నది. అయితే, అట్టి యుత్తమ విద్య లభింపవలయుననిన బాలికా బాలురకు ప్రత్యేకముగ విద్య గరుపుటా లేక అందరి నొకచో జేర్చి విద్య గరుపుటా యనునదియే ప్రస్తుతము ప్రపంచము నెదుర్కొనుచున్న ప్రధాన సమస్య. అవయవ నిర్మాణమందును, స్వభావ శక్తులందును స్త్రీ పురుషులకు పెక్కు భేదములున్నవి. స్త్రీలయందు ప్రేమ, శ్రద్ధ, కోమలత్వములు మూర్తీభవించి యున్నవి. పురుషులలో ధైర్య, స్థైర్య త్యాగ శక్తులు పొడకొని యున్నవి. అట్టిచో నీరెండు తెగలకు నొకే విద్య నేర్పుట పొసగదు. తల్లికి నేర్పిన విదయే తండ్రికి నేర్పిన సంఘము భంగమై జాతి తారుమారగుట తప్పదు. అదిగాక స్త్రీ పురుషుల కార్య క్షేత్రములు వేరు. ఒక స్త్రీ కృషి శాస్త్రము నభ్యసించి కార్యక్షేత్రమున గాలిడినను పురుషునివలె కష్టించి కడవరకు కార్యమును సాధించుటరుదు. ఒక పురుషుడు పాకశాస్త్ర పారంగతుడైనను స్త్రీవలె యోపికతో వంటపని సాగింపలేడు. కావుననే రస్కిన్ మహాశయుడు స్త్రీ పురుషుల మానసిక తత్వము నిట్లు విభజించినాడు.

**His intellect is for speculation and invention, his energy for adventure .........her intellect is for sweet ordering, arrangement and decision.**

ఈరీతిగా స్త్రీ పురుషుల మానసిక శక్తులందు కొండంత భేదము పైకి గనబడుచున్నను మనవారింకను స్త్రీ పురుషులొకే చోట, ఒకే పద్ధతి విద్య నభ్యసింపవలెనని చెప్పుచున్నారు. ఇట్టి దారుణవాదులున్నారనియే కాబోలు రస్కిన్ మహాశయుడు మరింత ముందుకుబోయి మరిన్ని భేదములు చూపెట్టినాడు. పరికింపుడు:

**It is of little consequence how many positions of cities she knows or how many dates of events, or how many celebrated persons.........it is not the object of education to turn a woman into a dictionary.........she should be taught to enter with her whole personality into the history she read.**

ఒకే పాఠశాలలో ఒకే గురువుద్వారా ఒకే పద్ధతి విద్య నభ్యసించిన బాలికల స్థితి నేడు కడు శోచనీయముగనున్నది. వంట జేయుటకా చేతగాదు. బిడ్డలను పోషించుటకా పనికిరారు. చివరికిందలి ఫలితము భర్తల తిట్లు, అత్తల గరిటె వ్రేట్లు. పాపము, వీరి చిక్కులంతటితో బోలేదు. నిరంతర సాహచర్య ఫలితముగా వీరిలో చాలా మంది ఆచార వ్యవహారములందేమి వేష భాషలందేమి బాలుర ననుకరించుచున్నారు. ఆ అనుకరణ వాంఛ రానురాను విద్యార్జనోద్దేశము (Character brilding) గూడా ఏగిపోవునంతటి వేలము వెఱ్ఱిగా పరిణమించుచున్నది. ఈ దుష్పరిణామమును గుర్తించియే మొకట సహవిద్య (Co-education) యని ఆక్రోశించిన పాశ్చాత్యులు నేడద్దానిని తమ దేశమునుండి బహిష్కరించుటకు ప్రయత్నించుచున్నారు. పాశ్చాత్యులకు సహితము పనికిరాని యిట్టి పద్ధతి నేడు మన కాదరణీయమైనది. కాగడాబట్టి గాలించిచూచినను భారతదేశ ప్రాచీనేతిహాసములందు సహవిద్యను గురించిన సంగతి సందర్భములే మనకు గోచరింపవు. ప్రత్యేక గురుకులములందు పాండిత్యము నార్జించిన భారత విదుషీమణులు పూర్వము బహిరంగ చర్చలలో పాల్గొనవలసి వచ్చినప్పుడు తెరల మరుగుననుండియే వాదించెడివారట.

సహవిద్యను నేర్చుచున్న బాలురు కళాశాలలయందు గావించుచున్న దుండగముల నాకర్ణించి మహాత్ముడు వారి నిటీవల తీవ్రముగా మందలించినాడు. శాంతిధనుడగు మహాత్ముని మందలింపులకు సహితము పాత్రులు కావలసివచ్చిన ఇట్టి యువకులతో గూడి విద్యను నభ్యసించుటకంటె యువతులకు ప్రమాదకరమైన విషయము వేరొకటి లేదని నా మనవి.

కావున మా సోదరీమణులిందలి పవిత్రాదర్శ సూక్ష్మమును గుర్తించి సహవిద్యకు స్వస్తిచెప్ప గోరుచున్నాను.

# కాశ్మీరమంజిలీలు

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు

—: మునికుటీరము :—

టోండా కుటుంబమునకు ధన్యవాదము లర్పించి, అనంతరము ఆశ్రమము దిక్కుగ పయనమైతిని. ఊరివా రిరువదిమంది వెంట వచ్చిరి. మా తెరువు పచ్చని చేలందు గలదు. అందచందములకును, పాడి పంటలకును నోచుకొనినది పాంచాలసీమ. గంభీర ఋగ్వేదవాక్కులు తొలుత ప్రతిధ్వనించినది పాంచాల హృదయమందే కదా! ఆర్థికముగను, ఆధ్యాత్మికముగను, భారత చరిత్రయందు ముందు మిక్కిలి గణుతికెక్కినదిదియే! ప్రాతఃకాలమున పొలమున నడచుచుండగా ఐహిక చరిత్రాంశములు మనమున దిద్దిర తిరుగదొడగినవి. కనువెదుట నొప్పారు సౌందర్యము మనమును హరించినది. తోడివారు ఆనాటి మహాత్త్వమును ఆవేశభరితహృదయులై ఉగ్గడించుచు, తోడ్తోడన తత్త్వశాస్త్ర మతశాస్త్రము లందలి తమ ఘనపాండితిని ప్రదర్శించుచు, చీటికి మాటికి తులసీ రామాయణమందలి చరణములను హావ భావములతో నేకరువు పెట్టుచు నడువదొడగిరి. ఉత్తర హిందూస్థానమున పామరహృదయములకు కూడ సన్నిహితమైనది తులసీరామాయణము. రామునివలన తులసీదాసును, తులసీదాసువలన రాముడును కీర్తి రాశులకు దైవికజీవితమున సద్గతి చుట్టములైరి. తమ జీవితతత్త్వమువలన, రచనామహత్త్వమువలన అసంఖ్యాకులకు అన్నికాలములందు సన్నిహితులై యుండజాలు గ్రంథకర్తలు ధన్యజీవులు కారా? పూర్వోక్త కాలమందు ఒక పర్యాయము తులసీదాసు రామాయణమునుండియు, వేరొకమారు భగవద్గీత నుండియు భావబంధుర వాక్కులనుచ్చరించు చున్నారు. ఇట్టి పాండితిని, ఇట్టి భక్తిని కలవారు (నేను పండితుడననియు, భక్తుడననియు భ్రమసి) ప్రశంసించుచుండ మిన్నకొనియుంట నాకు తగదని, నా గౌరవమునకు వారి సద్భావమునకు బన్నము దెచ్చుటని యూహించి నాకు తెలిసిన ముక్కలను భైరవి రాగముతో నాలపింప సాగితిని. దాక్షిణాత్యులవలె నుత్తరాహులు రాగాలాపన సహింపలేరు. నా "భైరవి"లో ముఖారి తక్క తక్కిన రాగములన్నియు యథేచ్ఛగా దొరలుచున్నను, నడుమ నడుమ చేసేయు రాగాలాపనము నాగుండెలలో దడదడ లాడించుచున్నను, "వా! వా! బహుత్ అచ్ఛా!" అని మిత్రులు నన్ను ప్రశంసింపదొడగిరి. వారు ప్రశంసించిన కొలది నా యాతన మధికమైనది. గీతకును, తులసీ రామాయణమునకును సంబంధించిన శాస్త్ర ముగియగనే, తెలుగు కవులనుండి చిత్తము వచ్చినట్లు పద్యములను విసరదొడగితిని. వివిధ కవులందలి పద్యపంక్తులను మిళాయించి, సాంతధోరణి గొంత వానిలో గలిపి, ఒక్కొకపుడు స్వంతగద్యము ను రాగధోరణిలో ప్రవేశపెట్టి బహుభంగుల నా ప్రజ్ఞను ప్రకటించితిని. కూడ తెలుగు పైతో దివ్యమైన మందినరిమెదల నాధోరణిలోని గుట్టుమట్టులను బయల్వెట్టి రసాభాసము గావించియుండును. టోండా బుదంకాయలు మాజట్టులో ప్రవేశింపక తమ ధోరణిలో తాముండిరి. ఒక నిముసము కోపోద్దీపితులై, వేరొక నిముసము పరమానందభరితులై వారు వింత రీతుల ప్రవర్తింపసాగిరి. ఉదరభారమువలన టోండా ఊగిసలాడుచు నడచుచుండగా పొట్టిపిల్లి పకపక

నవ్వుచు, చప్పట్లు కొట్టుచు, రాగధోరణిలో నట చుచు, తోండాచుట్టు గంతులు వేయుచు మా వెన్క నుండి వచ్చుచున్నారు. నాటి ప్రభాతప్రయాణము నాకెంతో వేడుక గలిగించినది.

దూరము అరమైలని బాలకుడు తెలిపినాడు కాని రెండు మైళ్లకది తక్కువ యుండదని గ్రహించితిని. మునికుటీరమును మేము చేరునరికి జాము ప్రొద్దెక్కినది. కుటీరమున దివ్వెల మాదుడుంగలు మెల్లమెల్లగా కాలుచున్నవి. సమీపమున బూడిదరాశి యున్నది. బాబాజీ అదూరమున గూర్చుని మెల్లమెల్లగా శ్లోకమో యనుకొనుచున్నాడు. అతని మొగమంతయు భస్మముతో వెలయుచున్నది. దీర్ఘమైన వాని గడ్డము నెరసినదని తెలుపలేము గాని బూడిదవలన నది నెరసినట్లే యగపడుచున్నది.

ఉత్తరహిందూస్థానీయులకు యోగులనిన ప్రీతి మెండు. ఈ యోగులందఱు నిష్కాంక్షులు తపశ్శాలురని తెలుపజెల్లదు. కాని, కొందఱు కొందఱు నిష్కాంక్షులగుదురని తలచుట అనుచితము కాదు. ప్రశాంత పవిత్రవాతావరణమున వసించుచు, పెక్కుమార్లు ఉపవాసములు సలుపుచు జపతపములు చేయు మహాత్ములు కేవలు గలరు.

స్వాంత ముక్తిమీదనే మననుంచువారిని యిట్టి వారిని దేశసేవకులు జుగుప్సతో వీక్షించుచున్నారు. సాంఘిక సేవాధురంధరుల కగ్రస్థానమొసగి యోగులకు గబే ప్రవృత్తులు తమ పూజాగృహమున ద్వితీయ స్థానము నొసగిరి. భావోపాసనముపై, మననిదిధ్యాసనములపై, గభీరధ్యానముపై, అవిచలితసమాధిపై, మహిమపై మనసుంచువారు సర్వకాలములందు, సర్వసీమలందు మానవసముద్ధరణమునకు తోడ్పడు భావసృష్టి గావింపగలరు. భావశక్తి దృష్టాంతరశక్తుల మహత్తరములు కదా! మునిముఖ్యులను మునిమ్రుచ్చులని వచింపరాదని నాయభిప్రాయము.

ఎల్లఱము స్వామిమ్రోల సాగిలపడితిమి. చిరపరిచితులవలె తోడివారు మునిమ్రోల నెన్నెంతో భూషించుచు విరాగితో నాకు పరిచయము గలిగించిరి. అమాయికుల భూషణ కెట్టి యాధారమును ఉండనక్కఱలేదు కదా! స్వామిజీ సన్నతివాత్సల్యముతో విలోకించి, దాక్షిణాత్యక్షేత్రములను గుఱించి కొంతసేపు ముచ్చటించి మిత్రులనందఱి నలరించెను.

అపూట ఆశ్రమమునందే గడచినది. అంతేవాసి యొకడు అందఱకు ఎంతో ప్రసాద మొసగినాడు. ప్రసాదము హల్వా! ఉత్తరహిందూస్థానీయులకును, హల్వాకును పూర్వజన్మమందు దగ్గఱ చుట్టఱికముండియుండును. కావుననే యీజన్మమందును వారు దానిచేపట్టి ప్రాకులాడుచుందురు. అతిథుల కొఱకుగాదు ఫలహారమున గనుడు, దేవతల కొఱకు ప్రసాదమున గనుడు హల్వానే వారు ప్రయోగించుచుందురు. హల్వాకును ఉత్తరాదులకును పెట్టి సఖ్యముండెనో దానికిని, నాకును తొల్లింటి భవమున నట్టి వైరముండి యుండును. హల్వా ప్రత్యక్షమైనంతనే నాకు కట్టురాని ఆగ్రహము గలుగుచుండును. దురదృష్టమేమని తెలుపుదును? ఉత్తర హిందూస్థానమున ఆశ్రమములందును, ఆలయములందును, మిత్రసదనములందును ఆదియే నాకు తప్పని సరిగ ప్రత్యక్షమయ్యెడిది. హల్వాకును, నాకును చుట్టపుటాపు ఉండరాదను నంశము తెలియక ప్రేమపూర్వకముగ మిత్రులు దానిని నాముందుంచినపుడు అంతరంగికముగ నేనడు బాధ జగదీశునకే యెఱుక. దానిని ప్రత్యక్షము చేసిన వారొరులైనచో నమస్కరించి, ఆ పాపిష్ఠపు పదార్థము తక్షణమే సమ్ముఖమునుండి తొలగింపుడని కంఠమెత్తి వచించువాడను. ఆదరాను రాగములతో మిత్రులు దానిని ముందుంచినపుడు అట్లు వచించుటకు మనసెట్లీయకొనును? ప్రేమను ప్రతిఘటించుటకు పిశాచమునకైన సాధ్యము కానపుడు మానవునకెట్లు సాధ్యమగును? స్వతస్సిద్ధమైన హల్వావిరసిక మనసుర

క్షేమరసము మరెంత తియ్యందన మొసగుననుట స్పష్టాంశమే కదా ! ద్విగుణీకృతమైన మాధుర్యముతో కొవ్వు నీపదార్థము పెట్లో నోట బెట్టుకొనుట నాకు విధియయ్యెడిది. గుండెలు దడదడలాడ నోటబోవు పదార్థ మెంతయుండును ? పలుసంతహాల్వా కాల్క-మైనదినంతన గొంతసేపు వమనము వరికట్టుటకై విశేష యత్నము సలుపవలెనుగదా ! ఈ ప్రయత్నమునకు భంగము ఘటించిన పెట్టి రసాభాసము సృష్టికాదు? ఈ పరిస్థితులలో ముఖ్యాహారముగనే హాల్వా యుద్దింపబడుచో "హా ! హావిధీ !" యని నోసలు చిలచికొనకుండు టెట్లు?

ఆశ్రమమున నేడు ప్రత్యక్షమైన హాల్వాయే ఆహారముగనే పరిగణింపవలెనని గ్రహించితిని. అదే ప్రసాదము ! అదే ఆహారము ! పరిమాణమునుబట్టి, వేళనుబట్టి భావమును గ్రహించుట కష్టము కాదు. మిత్రవర్యులు హాల్వాతోనే ఉదరములు పూరించిరి. నేనేమి చేయుదు? ఆశ్రమములో చేయవలసిన తపము చపాటీలకా ? ఎదుటి యాకులోని పెద్దముద్ద "ముట్టు"మని నన్ను సవాలు చేయుచునే యున్నది. పరమానందముతో నిరువదిమంది దానినారగించుచు "పాయియే పండిట్జీ!" ("ఆరగింపుడు అయ్యా !") అని బలవంత పెట్టిరి. కొంతసేపు నిర్విణ్ణుడనై కూర్చునియున్నను, దాపురించిన ముప్పును దూరముగ పెట్టించు నుపాయ మేలుగక జంకుచు గొంకుచు కొంతముద్దదీసి నోటబెట్టి తత్క్షణమే గ్రుక్కెడు నీటిని నోటబోసికొని హాల్వా పెట్లో దిగమ్రింగి యిక గూర్చుండక లేచి చేతిని, మూతిని కడుగుకొని "అమ్మయ్య" యని స్వామికి ప్రక్కజేరితిని. కొంతసేపటిలో మహాశయులందరు వచ్చి చేరిరి. వారి ప్రసంగ ధోరణివలన నాశ్రమమున కగు వెచ్చమును తీరివారే వహింతురని గ్రహించితిని.

నాది పిట్టతిండియని అపోహపడి కాకోలు వలె యాహారము మాట మిత్రులెత్తిరి కారు. ఉదయమున ఉదరమున మామూలుగా పడవలసిన లేనీరు పడలేదు. ఇప్పుడు భోజన మీ రీతిగా జరిగినది. కడుపులో జగజగ మండుకొనిపోవుచున్నది. బుడంగాయ కడుపార భుజించి బోండాలో ఎంతో రీతిగా ఇష్టాగోష్ఠి సలుపుచున్నారు.

ఇక నందుండి తరల నిశ్చయించి స్వామికి సెలవు వేడితిని. "కొలదిదినము లిందుండుటకు మీకు వీలు లేదా ?" అని బాబాజీ పలికెను. హాల్వా కొంత అరుల గొలిపినను, శాంతినిలయమైన ఆ యాశ్రమమున గొన్నిదినము లుండవలెనని మక్కువపడితిని. కాని యుండుటకు వీలులేదు కదా ! తద్విషయ సంగతి తెలిపి సెలవు బడసి "సాధ్యమగునో మేలో కమా తేచటికి వత్తు"నని రోగగ్రంథిన తెలిగించి, అతని యాశీస్సులంది అనుచరునితో పయనమైతిని. కొద్ది పలుకు నూరికెయ్యరులు వచ్చిరి. దారి వారికి పరిచితమైనది కావున నవలీలగ నీమాలు పొలమునుండి దాటిపోతిమి. అప్పటికి ఒంటిగంట దాటెను. ఈ పర్యాయము బస్సుకై విశేషకాలము తడయ నక్కఱలేకపోయెను. అదృష్టము ! అనృతసరమునుండి లాహోరుపోవు బస్సు అచిరములో వచ్చి, నేను చేసన్న జేసినంతన సమ్ముఖమున నాగినది. దీని వాలకమంత ఘోరముగా నగపడలేదు. ఈశ్వరుడు దయామయుండు కదా ! మిత్రులను ఒకరినొకరి నుద్దేశించి "నమస్తే !" అనుకొంటిమి. బోండాకు మరోకమారు ధన్యవాదము లర్పించి బుడంగాయతో పోయి బస్సులో ప్రవేశించితిని. మరల నమస్తేలు వినిపించినవి. బస్సు చరచర సాగిపోయినది.

సంపాదకమహాశయా!

నా యీ కష్టాలను 'గృహలక్ష్మి' ద్వారా ప్రచురించు కుందామనే ఆశ చాలా కాలాన్నుంచి యుండేది. దాని వెంటనే పత్రికాభావ వ్రాయనేర్వని నాబోటివాళ్లు వ్రాసిన అవక తవకభాషను ప్రచురించుతారా అనే శంకహృదయంలో తట్టి నిరుత్సాహపడుతూవుండేదాన్ని. ఐనా ప్రత్యేకం స్త్రీలపాలిట కల్పతరువైన 'గృహలక్ష్మి'యే నా యధార్థకష్టాలను ఆలింపక నిరాకరించిన ఇక ఆదరించేవారెవరు? అనే ధైర్యంతో వ్రాయబూనితిని. నేను, అదిగాక పైగా ఈ కాస్త విజ్ఞానం గూడా 'గృహలక్ష్మి' ద్వారా సేకరించితిని గాన మా పత్రిక యనే అహంభావముతో వ్రాయబూనితిని.

కాబట్టి నన్ను నిరుత్సాహపెట్టక గట్టిగా ఈ మాసపు సంచికలోనే ప్రకటిస్తారని ఆశిస్తున్నాను. వచ్చే ఫిబ్రవరిసంచిక కొరకు వ్రేళ్లు లెక్కిడుకొనుచూ, నిరీక్షిస్తూ వుంటాను.

ఇట్లు,

ఒకఅభాగిని.

# ఇదా నవయుగము!

(ఒకఅభాగిని)

●

స్త్రీ స్వాతంత్ర్యము, స్త్రీ స్వాతంత్ర్యము అని దశదిశల మారుమ్రోగుతూ, గగ్గోలు పెట్టుతూవున్న ఈ రోజుల్లో స్త్రీలకు జరుగుతూవున్న ఘోర పశుకృత్యాల్ని అనుభవముద్వారా వివరించుతాను వినండి.

నేను తెనాలితాలూకాకు చెందిన ఒక కుగ్రామంలో కమ్మకుటుంబానికి జెందిన ఒక కన్యను. ఇప్పుడు నా ప్రాయము పదునెనిమిదిసంవత్సరములకు మించినది. నా తల్లిదండ్రులు నిరక్షరకుక్షులు. పైగా అతి మూఢాచారపరులు. మా యింటి దాపుననున్న స్వజాతి యువకుడొకడు మా ఇంటికి తరచుగా వస్తూ పోతూ వుండేవాడు. ఈ యువకుడు సామాన్య విద్య అట్టే అంత పెద్దా చిన్నాగాని భూస్థితి కలవాడు. కొంత కాలానికి మా ఇద్దరకు ఒకరిమీద కొకరకు అవ్యాజానురాగ మేర్పడినది. చివరకు ప్రణయగాథలోనికి దిగింది. ఇద్దరము పరస్పరగాఢానురాగముతో వివాహము చేసికొన నిశ్చయించుకున్నాము. ఈ సంగతి కొంతకాలానికి మాయమ్మ పసిగట్టి నాలుగు చీవాట్లతోటి ఆయబ్బాయిని మా గడప త్రొక్కకుండా చేసింది. నన్ను గూడా చాలా హింసించారు. అప్పటినుంచి ఆ యువకుడు మా ఇంటికి రానంతమాత్రాన మా పరస్పరప్రేమకు కొరతవడలేదు. కొన్నాళ్లకు నాకొక సంబంధము తెచ్చారు మావాళ్లు. నా ప్రాణము తీసినా అన్యుని వరింపనని గట్టిశపథము చేశాను. నేను వాళ్లమాట విననికారణంగా చాలా చాలా బాధపెట్టి హింసించి, చివరకు నిన్ను చంపియైనా సరే మా కుటుంబ మర్యాదను కాపాడుకుంటాం గాని, మేముమట్టుకు మా ప్రాణాలు పోయినా, నీవుకోరే వరున కిచ్చి చేయమన్నారు మా తల్లితండ్రులు. చివరకు ఆ యబ్బాయిని తన్ని వూరినుంచి వెళ్లగొట్టాలనిగూడా ప్రయత్నించారు. ఐతే అంతపని సాధ్యంకాకపోయింది. ఇది ఇట్లుండగా అమ్మలక్కలందరు వరసాయిగా రా సాగారు మా ఇంటికి చోద్యము చూడ్డానికి. ఒకమ్మ "అమ్మో! ఎంత విడ్డూరమమ్మా మా కాలంలో ఈ మాయదారి ప్రేమలు, వలచి పెండ్లిండ్లు చేసికొనుట మే మెరుగమమ్మా పెద్దవాళ్లు ఎంత చెప్పితే అంత గిరుగీసి గీతలో వుండేవాళ్లమమ్మా" అని ముక్కుమీద వ్రేలువేసుకొని చెప్పసాగేదొకమ్మ. మరొకమ్మ "అమ్మో ఇంత ఘరానాగా బ్రతికిన మీ కుటుంబానికి ఎంత అపకీర్తి తెచ్చిందమ్మా! ఇటువంటివాళ్లు వుంటేనేమి పోతేనేమి" అని పళ్లు పటపటకొరుకుతూ అనేది మరొకమ్మ. ఈ విధంగా అమ్మలక్కలందరు అగ్గిలో గుగ్గిలంపోసినట్లు మావాళ్లకు మరింత

మంట కలుగజేసి నన్ను మరింత బాధలు పెట్టించి సంతోషిస్తూ చూస్తూ కూర్చొండే వాళ్లు. మావూళ్లో మా యీ ఆదర్శవివాహాన్ని ఎట్లైనా పట్టుదలతో చేయించాలని కార్యదీక్షతతోనున్న ఒక విద్యాధిక బ్రాహ్మణుడు నన్ను సోదరిమాదిరి చూస్తూ విద్యాభివృద్ధి చేయమని పత్రిక పుస్తకాలిస్తూ వుండేవాడు నాకు. ఆయనగారిని నాలుగు కూశలేసి మా ఇంటిసాలి రాకుండా చేశారు. నేను పత్రిక, పుస్తకా లేవైనా చదువుకుంటూంటే ఇంతా చేసింది ఈ మాయదారి చదువులేనని ఆవేశంగా పడదిట్టుతూ నా చేతిలోనివి, లాగిపారేస్తూ వుంటుంది. అప్పటినుంచి ఇప్పటివరకు పుస్తకంగాని పత్రికగాని వాసన లేకుండా చేశారు మా వాళ్లు మా ఇంటిలో. నాకొరకేనా, అన్నట్లు ఒక వితంతువును జేసి, మా పెద్దమ్మ నొకామెను తోలాడు భగవంతుడు మా ఇంటికి. ఈమెగారి వత్తిడివల్ల నా బాధలు చెప్పేటందుకే అలవిగావు. ఆ నాటినుంచి ఈ నాటివరకు నేను లేచినా, కూర్చున్నా, పగలురాత్రనక నా చుట్టూ పహారా ఇస్తూ వుంటారెవ్వరోకరు. చివరకు బ్రతుకు తెరవు లేక, జీవితంమీద విరక్తి కలిగి ఏనుయ్యో గొయ్యో చూసుకొని ఆత్మహత్య చేసుకుందామన్నా ఆమాత్రపు అవకాశానికి గూడా నోచుకోలేదు ఈ అభాగిని.

కాస్తోకూస్తో పేరుప్రతిష్ట గలిగినటువంటి సోషలిష్టు ఐన మా అన్నగారొకాయన వున్నాడు. ఈయన జీవితంలో అత్యధిక భాగాన్ని పల్లెటూరి ప్రచారానికే వినియోగిస్తూ వుంటాడు. ఈయనగారు వేదికలెక్కి "స్త్రీ స్వాతంత్ర్యమియ్యాలి, సంఘసంస్కరణ జరగాలి, మూఢాచారాలంతరించాలంటూ" గంభీరోపన్యాసా లిస్తాడు. నా విషయాని కొచ్చేటప్పటికి "నాన్‌సెన్సులా" అంటాడు. మరీ మాటాడితే 'లా' అంటే ఏ, బి.యె. యమ్.ఏ.లు చదివి దేశాటన చేసినవాళ్లకే తప్ప నీబోటివాళ్లకేమీ అర్థము కాదంటాడు. ఈ నాయన్నగార్కి ప్రేమంటే పెద్ద విద్యాధికులకు తప్పక నోరూ వాయిలేని మూగజంతువులకు సయితము వుంటుందని ఎరగకు కామాలి. పైగా ఎవ్వరైనా మా అన్నగారిని ఇది చాలా సమంజసమని ఇటువంటి ప్రేమంపు వివాహాన్ని చేస్తే చాలా ఆదర్శకంగా వుంటుందని నీవు సౌఖ్యం కలుగచేసుకుంటే వాళ్లకి కష్టాలు గట్టెక్కుతవని చెప్పితే "ఈవిషయంలో నేను పెద్దవాళ్లకు ఎదురు తిరిగి సౌఖ్యం కలిగించుకున్నట్లైతే 'నాలైఫ్ రూయిన్' అవుత"దంటాడు. కావటానికి అన్నగారైనప్పటికి ఇటువంటి పరిపక్వదశకు రానిదొంగ సోషలిష్టుల వలన, సోషలిష్టు సంఘానికే ముప్పు వాటిల్లుతుందని విచారిస్తున్నాను.

మరొక సంగతి నాకు ఇంకొక చిన్నన్న ఛోటా సోషలిస్టు ఒకడువున్నాడు. ఈనగారి విచిత్రగాథ ఇంకోటి వుంది చెప్పుతాను. యీయనగారు మొన్నమొన్నటివరకు మా ఇద్దరి మధ్యనా వుత్తర ప్రత్యుత్తరాలవరకు జరుగుతూ మా ఈ ప్రేమంపు వివాహానికి

రహస్యంగా చాలా దోహదమిచ్చాడు. తీరా చివరకు పెద్దవాళ్లు వీడుగూడా ఈ ఆలోచనలో వున్నాడని గ్రహించి, తన్ను కోయి ఇదిగో చూడు ఇంకా ఏమిచేస్తామో అని రెండు లంపకాయలు వుచ్చుకొనేటప్పటికి, ఇలా వుంటే ఇక లాభములేదని, లబో దిబో నేనేమి ఎరుగనని ప్రమాణాలు చేసి తనమీదవాళ్ల కే మాత్రం సంశయం వుండకుండా వుండేందుకు, ఆ యువకుణ్ణి కొట్టటానికి మా పెద్దవాళ్లతో సహా బయలుదేరాడు. మొదట్లో నేను తను తప్పుకొనుటకే ఇలా నటనచేసి మాయబూటకాన్ని పన్నాడని తలంచి పొరబడితిని. తీరా ఇట్లా చూస్తే నన్ను చూచినప్పుడల్లా కళ్లెర్రచేసి కసకసలాడుతూ పైగా నీవు వాడిని వదిలివేసి మేము నిశ్చయించిన పుల్లాయిని చేసుకుంటావా లేదా! నీవు ఇష్టపడక పోయినట్లైతే ఏమి చేస్తానో చూడు అని బెదరించ సాగినాడు. అదీగాక పాపం ఆ యువకుణ్ణి తన్ని వూరినుంచి వెళ్లగొట్టాలని గూడ ప్రయత్నిస్తున్నాడు. మొన్నటిదాకా ఈ విషయం చాలా మంచిదని పైగా మాకు ఎంతో సహాయం చేసిన వానికి ఈ నాడింత రిమ్మతెగులు పుట్టుటకు గల కారణా లెవ్వో నాకు బోధపడుటలేదు. పెద్దవాళ్లవలన ఎముక లిరుగుననే భయము చేతనో లేక మరే కారణంతోనో ఇంతలోనే ఇంత మార్పుచెంది ఇటువంటి నీచానికి పాల్పడిన నా చిన్నన్నగారిని నేనేమనాలో నా కర్థమగుట లేదు.

కుటుంబపోరే చెప్ప నలవిగాకుంటే బయటి సంఘపుపోరుకి అంతేలేదు. ఆ యువకునికి నాకు ఏమేమో...... ..అని ఒక పెద్దదోషాన్ని ఆపాదించిందీ సంఘం. పాఠక మహాశయులు నన్నొకటి ప్రశ్నింపవచ్చును. నీవీమాత్రం జ్ఞానము గలిగి పైగా మేజరై యుండికూడ నీ స్వేచ్ఛానుసారం ప్రేమించిన వానిని పెండ్లిచేసుకొనుటకు అడ్డుపెట్టే వారెవరు? ఒకవేళ అడ్డుపెట్టి గవర్నమెంటు ద్వారాగాని లేక మరి ఇతరత్రా నైనా రక్షణలు లేవా యని ప్రశ్నింపవచ్చును. అవును అదిగూడసత్యమే. కాని ఇప్పటి వరకు ఈ సంఘమనే పెనుభూతాన్ని చూసి భయపడుతూ పైగా ఈ సంఘమింకేమి దేయనున్నదో యనే భయోత్పాతముచే నిదానించితిని. ఇంకా ఇలాగే కట్లు తెగే వరకు బిగించితే మాత్రం జరిగేదేమో తప్పక జరుగగలదు.

---

ఇందలి విషయములు పూర్తిగా నిజముగావచ్చును, కాకపోవచ్చును. కాని, ఇట్టివి జరుగుచుండుట కాదనలేము. ఈ 'అభాగిని' తన పూర్తి విలాసమును మాకు తెలియపరచి సహాయము కోరిన, తగు విధముగ చేయుటకు సిద్ధముగానున్నాము.

సంపాదకుడు.

# ఆంధ్ర సోదరీ!



శ్రీ సన్యాల వేంకట రంగనాథరావుగారు

ఏమహోత్కృష్టమౌ శబ్దమో విశాల
ఆంధ్ర భూమపై జీవకంఠాలలో ప్ర
తిధ్వనించుచు వ్యాప్తిఁ జెందినదో—అట్టి
పిలుపులోన నీవు జన్మించినావు.

*

ఎట్టి కార్యమైనను తలపెట్టువాడు
నీ సహాయమ్ములేక సంతృప్తినొంద
లేడు, అట్టివానికిఁ గాలులేని నరుని
కెట్టి భేదమ్ములేదు తల్లీ! నిజమ్ము.

*

ప్రాణ రక్షణమునకును మాన రక్ష
ణమునకును ఆత్మదానమ్మొనర్పముందు
నడుగువేసెడి దాన వీవనుటలోన
అతిశయోన్నతి లేదు రవ్వైన తల్లి!

*

స్వార్థ రాహిత్యమైననీ చల్లని హృద
య వనమందలి పుష్పించు ననవరతము
తెనుగుఁ తల్లికిఁ గావలసిన గులాబి
పూలు—వాటికి వాడిపోవుట తెలియదు!

*

సత్వము రజస్తమంబుల సంగమమున
గల గభీరాశయములు వ్యక్తమ్ము సేయు
సృష్టి నీలోనంతర్భూత శ్రీ పదమ్ము
టంచుఁ గల్పెద నాంధ్ర గీతాస్వరాన.

ఐహిక సుఖములలోఁ బడినట్టివారు
తిరిగి బ్రతికి మఱల చెడి మఱల బ్రతికి
బల్కుచుందురు స్త్రీయొక పాపరూప
మంచు స్త్రీ పదార్థమ్ము గుర్తించలేక.

*

సోదరీ! వానిఁ బాటింపరాదు నీవు
వారు సన్యాసులైనారు ప్రస్తుతమ్ము;
అర్హులైనను కారమ్మ ఆంధ్ర గీత
మాలపింపగ, కొనకు వాక్కైన లేదు!

*

మూడు రంగుల జండానుబూనిఁ నిలచి
ఆంధ్ర గీతమ్ము నాలాపనమ్ముఁ జేయు
చుండ మాతృ దేవినిఁగాంచు చున్నయటుల,
ఆంధ్ర సోదరి! కనిపింతువమ్మ నీవు!

*

పురుషులకు రాని ధైర్యమ్ము పూనుటన్న
నీకు సంకల్పమాత్రమె, నీహృదయము
తెలియలేనట్టివారు అబలవు నీవ
టంచు మాత్రము బల్కెద రబలలగుచు.

*

జ్ఞానశక్తియు కార్య దీక్షలోన పార
ప్రజ్ఞయునుగల నీవు ఆంధ్రత్వ ముట్టి
పడగ నడుగిడవమ్మ నీవాళ్లకిపుడు
మార్గదర్శివి నీవని మరువకమ్మ—!

# సినీమాలోకం

## ‘20-వ ఆంధ్రమహాసభ’ వార్తా చిత్రము

ఈనెల 22-వ తేదీని మద్రాసు మినర్వా హాలులో వాహినీ పిక్చర్స్ వారిచే తీయబడిన ‘20-వ ఆంధ్రమహాసభా చిత్రము’ను పత్రికా ప్రతినిధుల కోసం బహిరంగ పరచారు.

సమావేశానికి మహర్షి సాంబమూర్తిగారు అధ్యక్షత వహించారు. సర్. ముత్తా వెంకట సుబ్బారావు ప్రముఖులు విచ్చేశారు.

ఫిలిము చూస్తున్నంతసేపూ, తిరిగి మహాసభ అంతా ఇప్పుడు జరుగుతున్నదా అనిపించింది. అధ్యక్షులు రాధాకృష్ణన్‌గారు, ప్రారంభోపన్యాసకులు సర్ ముత్తా వెంకట సుబ్బారావుగారు, ఆహ్వాన సంఘాధ్యక్షులు వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారు, యీ మహాసభలకు సూత్రధారి శ్రీ సాంబమూర్తి గారు మొదలగు నాయకుల వుపన్యాసాలలోని ముఖ్య భాగాలను రికార్డు చేశారు. ‘మద్రాసు ఆంధ్రులది’ అనే విషయాన్ని ఎలుగెత్తి చాటిందీ చిత్రం. ఈ మహాసభల సందర్భములో జరిగిన లలితకళా ప్రదర్శనాలని కూడా చూపించారు. అందులో శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడుగారి ఫిడేలు, యీమని అచ్యుతరామయ్యగారి వీణ వాయిద్యాలు అమోఘముగా వున్నాయి. నాయుడుగారి ఫిడేలులోని జీవం ఆంధ్రకళా కౌశల్యానికి ఒక నిదర్శనం. ఆ వూరేగింపు ఉత్సవాలు, ఆ మేళతాళాలు, ఆ ప్రతినిధుల రాకపోకలు మొదలైన విషయాలన్నీ చూస్తే ఒళ్లు పులకరించేటట్లు చిత్రంలో చూపించారు. శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారి వందేమాతరం ప్రార్థనతో ప్రారంభమయి, ఆమె మంగళహారతితో ఆఖరయ్యింది.

ఆఖరిని శ్రీ సముద్రాల రాఘవాచారిగారు మహాసభ జరిగిన కాలం వానగా వుండుటచే చాలా శ్రమ మీద ఫిలిం తీయవలసి వచ్చిందని చెప్పారు. అయినా చాలా బాగుంది. సాంబమూర్తిగారు మాట్లాడుతూ, ఇట్టి చిత్రాలు దేశాభ్యుదయానికి చాలా వుపకరిస్తాయన్నారు. ఆంధ్రరాష్ట్రోద్యమం తీవ్ర రూపం దాలుస్తోన్న యీరోజుల్లో సకాలానికి యిటువంటి చిత్రాన్ని తీసుకొచ్చినందుకు వాహినీ పిక్చర్స్ డైరక్టరు శ్రీ బి. యన్. రెడ్డిగారిని, సముద్రాల వెంకట రాఘవాచార్యులుగారిని మేమభినందిస్తున్నాము. యీ చిత్రాన్ని ఆంధ్రదేశం అన్నిచోట్లా మారుమూలల్లోకూడా ఒకటికి రెండుసార్లు ప్రదర్శింపబడి ప్రజలలో బాగా ప్రచారంచేసే ఏర్పాట్లు చెయ్యాలసిందని కోరుతున్నాము.

## ‘సారథి’ వారి ‘రైతుబిడ్డ’ ప్రారంభోత్సవము.

“మాలపిల్ల”ని తయారుచేసిన సారథి ఫిలిమ్స్ వారి రెండవ సాంఘిక చిత్రం ‘రైతుబిడ్డ’ ప్రారంభోత్సవం మొన్న సంక్రాంతినాడు వుదయం 10-30 గంటలకు, మోహన్ పిక్చర్స్ కంబైన్స్ లిమిటెడ్ వారి స్టుడియోలో జయప్రదంగా జరిగింది.

సర్ కూర్మా వెంకటరెడ్డి నాయుడుగారు అధ్యక్షత వహించారు. వారు మాట్లాడుతూ, ప్రస్తుత సంఘాభివృద్ధికి కావలసిన విషయాలన్నీ దృష్టిలో వుంచుకుని రామబ్రహ్మంగారు “మాలపిల్ల” ఫిలిం తీశారని, అది బాగావుందనీ, వీరు తీయబోయే “రైతుబిడ్డ”కూడా ప్రజామన్ననలను పొందుతుందనటానికి సందేహం లేదని ఇటువంటి సామాజిక

చిత్రాలు తీయడానికి పూనుకున్న సారథి ఫిలిమ్సు వారిని అభినందిస్తున్నామని చెప్పారు. తర్వాత శ్రీ కె. సుబ్రహ్మణ్యంగారు కెమేరా క్రాంక్ చేశారు. ఆసమయంలో కూచిపూడి భాగవతులు వేదాంతం రాఘవయ్యగారు భరతనాట్యం చేశారు.

తర్వాత రామబ్రహ్మంగారు తమ యీ రెండవ చిత్రాన్ని నిరంతర రైతుసేవకులైన వ్యక్తియగు మునిస్వామినాయుడుగారికి అంకిత మిస్తామని తెలియ జేశారు.

ఆ తరువాత బళ్లారి రాఘవాచార్లుగారు ఫిలిం పరిశ్రమ, దానిలక్ష్యము, ప్రభుత్వముయొక్క బాధ్యత, మొదలైన విషయాలని గురించి ఒక మహోపన్యాసాన్ని గావించారు. యీ ఉపన్యాసాలు రికార్డు చేయబడ్డాయి.

తర్వాత మంగళంతో సమావేశం పూర్తయింది.

## ఆంధ్రటాకీసువారి 'మోహినీభస్మాసుర'

ఆంధ్రా టాకీసు వారి 'మోహినీ భస్మాసుర' చిత్రాన్ని పత్రికా ప్రతినిధులకోసం మద్రాసు ఎల్ఫిన్‌స్టన్‌టాకీసులో ప్రదర్శించారు.

డైరెక్టరు సి. పుల్లయ్యగారు దీన్ని డైరెక్టుచేసి, వారి కీర్తి స్థిరస్థాయిగా చేసుకున్నారు. ఈ చిత్రం నవరస భరితం. పుష్పవల్లి మోహినీరూపంతో వచ్చి తన నాట్య నైపుణ్యాని ప్రదర్శించి ప్రేక్షకుల్ని ముగ్ధుల్ని చేసింది. ఎ. వి. సుబ్బారావుగారు, 'విలన్ కేరక్టరు' ఎల్లా అభినయించాలో చూపించారు. వీరి నటనా చాతుర్యం, ఓ ఘట్టంకన్నా రెండో ఘట్టంలో రాణిస్తూవచ్చి, దుర్మార్గుడికికూడా హృదయమనేది వుంది సుమా అనే భావాన్ని నిరూపించింది—టంగల చలపతిరావు కోటీరత్నంగార్ల గానామృతం నిర్మల గోదావరీ జలంలా ప్రవహించింది—'బంధరాముని' హాస్యం కడుపుచెక్కలు చేస్తోంది. ఇక ఆఖరివిషయం—కాదు కాదు - అంతా అదే రంపారణ్యశోభ. అద్యంతమూ చిత్రంలో ఆంధ్రదేశపు అరణ్యశోభవెల్లి విరిసింది. చూపించిన దృశ్యం చూపించకుండా, మొదల్నించి చివరువరకూ ప్రకృతి దృశ్యాలతో ముంచెత్తేశారీ చిత్రాన్ని పుల్లయ్యగారు.

మరోవిశేషం—చిత్రం తీసినది రాజమండ్రి, డైరక్టరు కాకినాడవారు, పుష్పవల్లి సుబ్బారావుగార్లు గోదావరిజిల్లావాసులు, ప్రకృతి దృశ్యాలు రంపారణ్యాలు, ఇదే యీ చిత్రంలోని ప్రత్యేకత—అంతా ఆంధ్రకళే.

## ఆంధ్ర సినిటోన్ వారి 'భక్తజయదేవ్'

ఆంధ్ర సినిటోన్ వారి 'భక్తజయదేవ' ఆంధ్రదేశం అన్నిపట్టణాలలోనూ విజయవంతంగా సాగిపోతోంది. చిత్రం అన్నివిధాలా ఆకర్షవంతగావుంది—సంగీత సాహిత్యానికి గీతగోవిందానికి 'బ్రహ్మ' అయిన జయదేవుని లీలలిందు అద్భుతముగా పొందుపరుపబడ్డాయి. రెండుచింతల సత్యనారాయణ, వెల్లంకి వెంకటేశ్వర్లు, సురభి కమల, శాంతకుమారిగార్లు బాగా అభినయించారు.

## మాడరన్ సినిటోన్ వారి 'ఉషాపరిణయము'

మాడరన్ సినిటోను వారి మొదటి పౌరాణిక చిత్రమైన "ఉషాపరిణయం"లో సుప్రసిద్ధ మహారాష్ట్రీ గాయనీమణి శ్రీమతి పద్మావతిశాలిగ్రాంగారు 'ఉష' పాత్ర ధరిస్తారట. పుట్టుకచే ఈమె మహారాష్ట్రీయువతియైనా తెనుగుచిత్రములో నాయికాపాత్ర ధారణ చేయనుండుట యీమె యొక్క వివిధభాషా పారంగత్వమునకు నిదర్శనము. యీ చిత్రము షూటింగు యీ నెలలోనే ప్రారంభించడానికని డైరక్టరు గాలి వెంకటేశ్వరరావుగారు రిహార్సల్సు చురుకుగా సాగిస్తున్నారు. కంపెనీ మేనేజింగుడైరక్టరు రావుల సుబ్బారావుగారు యీ చిత్రాన్ని ఉత్తమోత్తమమైనదిగా చెయ్యాలని సర్వవిధములా పాటుపడుతున్నారు.

# ॥ శిశుజగత్తు ॥

**పిల్లలపైననే భావిభారతాభ్యుదయ మాధారపడి వుంది. పిల్లలను సముదాయించలేనప్పుడు భయపెట్టి ఆ పిరికిమందుతో వాళ్ల నోళ్లు కట్టటం మనసంఘాలకి పరిపాటైపోయింది. ఈ కాలంలో యింట్లో పురుడు పోసుకు క్షేమంగా వుండటమంటే మృత్యుగహ్వరంలోంచి బైటపడటం లాంటిదైపోయింది. వైద్యశాలలో పురుడు పోసుకోవటమే మంచిది. అత్యుపయోగకమైన 'పడికట్టు' విషయంలో మన నవీన సోదరీమణులు పెక్కురు అశ్రద్ధచేస్తున్నారంటే అతిశయోక్తిగాదు.**

ప్రియమైన వదినకు

నీవు దయతో వ్రాసిన వుత్తరం చేరినది. నీవూ చిరంజీవి పిల్లవాడు క్షేమంగా వున్నట్లు వ్రాయుటచే చాలా ఆనందము గలిగినది. కాని చి॥ పిల్లకు దాని బుల్లితమ్ముడంటే బొత్తిగా యిష్టంలేదనీ, నీవు దాని నెత్తుకుంటే అది సహించలేకుండా వుందనీ యీ విషయంలో యేదైనా వుపాయం వ్రాయమనీ వ్రాశావు. పిల్లలపద్ధతు లీలాగే వుంటాయి. 'పక్కింటి పిల్లవాడు నీతో ఆడుకోటానికి వచ్చాడనీ, నువ్వు చెప్పే కథలూ అవీ శ్రద్ధగా వింటాడనీ, యిల్లాగనక నువ్వు మారాంజేస్తూవుంటే తమ్ముణ్ణి పక్కింటి చిన్నపాప దగ్గరకు పంపేస్తాను—ఆ పాప యెంతోమంచిది, తమ్ముణ్ణి చక్కగా పెంచుకొంటుందిట' మొదలగువిషయాలు పిల్లకు రోజూ నచ్చచెపుతూవుంటే దానిలో అంతర్భూతమైన సోదరప్రేమ క్రమేపీ బైకుబుకుతుంది.

అంతేగాని చీకాకు తెచ్చుకుని పిల్లని భయపెట్టకు. మారాంబట్టి యేడిచేటప్పుడు పిల్లలిని వుత్సాహమైన విషయాలు జెప్పి ఆనందంలోకి దింపాలిగాని భయపెట్టి పిరికివాండ్లుగా తయారుజేయకూడదు. నేటిపిల్లలపైననే భారతాభ్యుదయ మాధారపడివుంది. శివాజీ అంత ప్రఖ్యాతపురుషు డయాడంటే దానికి అతని తల్లి జీజియాబాయి యే కారణం. తల్లులు పిల్లలకు ప్రథమగురువులు—ఇదంతా యెందుకంటావా? పిల్లలను సముదాయించలేనప్పుడు 'బూచాడెత్తుకుపోతాడనీ', 'ముష్టివాఁడు బుట్టలో వేసుకుపోతాడనీ', యింకా మోటువాళ్లైతే 'దెయ్యమనీ', 'భూతామనీ' భయపెట్టి పిరికిమందుతో పిల్లలనోళ్లు గట్టటం మనసంఘాలకు పరిపాటై పోయిందికా! అందుకని వ్రాశా యింతదూరం.

ఆసుపత్రినుంచి యింటికి క్షేమంగా వచ్చినట్టు వ్రాశావు. వైద్యశాలలో పురుడు పోసుకోవటమే యీకాలంలో వుత్తమం. ఇంట్లో పురుడుపోసుకు క్షేమంగా వుండట

మంటే మృత్యుగహ్వరంలోంచి బైటబడటం లాంటిదై పోయింది—కాని వదినా! భారత దేశం యెప్పుడూ యీలావుందనుకోకేం. పురిటిగదియందు మెలగవలసిన విధం సరిగా తెలియనివాళ్లు మంత్రసానులుగ పనిచేయు చుండుటే యిందుకు కారణమనుకుంటాను. ఈ వైద్యశాలలలో పురుడు పోసుకోవటం వచ్చిన తరువాత అప్పటికి పడమటిగాలి సోకటంచేత గాబోలు ఒక ముఖ్యవిషయంలో మన నవీనసోదరీమణులు అశ్రద్ధ వహిస్తున్నారంటే యతిశయోక్తి కాదనుకుంటా, అదేమిటంటావా 'నడికట్టు'.

ఇది పూర్వం బాగా ఆచరణలో వుండేది. వుపయోగమైందికూడాను. కాన్పువల్ల గర్భాశయంలోని నరాలు వదులై కండరాలు జారివుంటాయి. ఇది యథాస్థానానికి రావటానికి 'నడికట్టు' చాలా సహాయకారి. నడికట్టు కట్టుకోనిచో యీ 9 నెలలూ సాగిన కండరాలు మామూలుస్థితికి రావటానికి కదలకుండా అనేక నెలలు పడుకోవాలి. ఈ పడుకొని వుండటం బాధ తప్పించటానికే మనవాళ్లు 'నడికట్టు'ను వుపయోగిస్తూ వచ్చారు. ప్రాచీన సాంప్రదాయము పూర్తిగా విడువని కొందరు సోదరీమణులు యే వారంరోజులలో లేక పదిరోజులలో మాత్రం నడికట్టు ధరించి అటుపైని విసర్జిస్తున్నారు. కొందరు చప్పున కండరాలు మామూలుస్థితికి రావాలని అతి గట్టిగా బిగించి కడతారు యీ నడికట్టు. ఇది మిగుల అపాయకరం. 9 నెలలకాలం పుచ్చుకొన్న కండరాలంత త్వరగా మామూలుస్థితికి రాగలవా అనే విషయం యోచించరు. నవీనోద్దేశాలు ముందంజవేస్తూన్న మరికొందరు సోదరీమణులు నడికట్టును 'నాన్సెన్సు' దానివల్ల ఉపయోగమేమంటే దానికి బదులు యింట్లో వున్న భర్తదో లేక సోదరునిదో బెల్టు (belt) పెట్టేసుకొంటే తీరిపోతుందని యోచిస్తారు. నడికట్టులాగ వుపయోగించే 'బెల్టులు' అందరు సోదరీమణుల అందుబాట్లలోనూ వుండవు. వీరుపయోగించే యీ సన్న 'బెల్టులు' నిరుపయోగమైనవే గాక, పొత్తికడుపుని కడుపు పైభాగము నుండి వేరుచేసి అమితంగా వృద్ధిపొందిస్తాయి. నడికట్టు అధమము నెల లేక రెండు నెల్లు సోదరీమణుల యిచ్చ చొప్పున ధరించవచ్చును. మూడునెలలు ధ రిం చి నా మంచిదే. నువ్వు మరచిపోకుండా వుపయోగమైన యీ ప్రాచీన సాంప్రదాయాన్ని ఆచరణలో పెడుతున్నావనుకుంటాను.

ఇట్లు, నీ ప్రియమైన వదినె,

కల్పలత.

అఖిలమహారాష్ట్ర వ్యాయామ ప్రదర్శనములు

వివిధ వ్యాయామశాలలనుండి వచ్చియున్న బాలకులు 'శరీర సౌందర్యము' అను నొక వ్యాయామ శాఖలోని భంగిమములు చూపునప్పుడు తీసిన ఛాయాచిత్రము.



సౌవ్యలక్ష్మీ పూజ



అఖిల మహారాష్ట్ర వ్యాయామ ప్రదర్శనములు
వివిధవ్యాయామశాలలనుండి వచ్చియున్న బాలికలు 'లక్ష్మీ-డ్రిల్లు'
అను ఒక వ్యాయామశాఖలోని కొన్నిరీతుల చూపుట.

# ఎవరు బాధ్యులు?

శ్రీ కాశీనాథుని నాగభూషణరావుగారు

ఏమండీ! వింటున్నారా! నేను ఎంత చెప్పిన ఇల్లు గట్టుకొని పోరుతూవున్నా మీరు నా మాట బొత్తిగా చెవిన పడకుండా వచ్చింది. సరళ పెద్ద మనిషై చాలాకాలమైంది. బ్రాహ్మణులమైనా ఉన్నాళ్ళు ఎదిగినపిల్లను ఇంట్లో పెట్టుకు కూర్చుంటే లోకులు ఏమని పోతారు? అని అన్నది కావమ్మ తనభర్త రామేశంతో.

రామేశంగారికి పిత్రార్జితమైన ఆస్తి ఏమీ లేదు. వాళ్ల పల్లెటూరులో వున్న స్కూల్లో ఒక ఉపాధ్యాయుడుగా పనిచేస్తూవున్నాడు. ఆరుగురు పిల్లలు, భార్య, భర్త......ఇంతమందికి జీవనోపాధికి తన స్కూల్ జీతము పనిలోవచ్చే పదునిమిది రూపాయలు తప్ప ఇతర ఆధారా ఏమీ లేదు. కావమ్మ ఒంటిమీద ఏవన్నా సొమ్ములంటే అమ్మి పన్నా యీ పెళ్ళి కాస్తా చేస్తామనుకొంటే, కావమ్మగారికి పుట్టింటివారు పెట్టిన కాలూరు రెండుజతల బంగారుగాజులు తప్ప ఏమీ లేవు. రామేశానికి ఏం చెయ్యటానికి పాలుపోయ్యేది కాదు. పోనీ ఆ వున్న ఇల్లునా అమ్మేసి యీ కార్యం చేసేద్దామనుకొంటే, ఆ యిల్లుకూడా పరాయివాళ్లది. వీళ్ళ లేదరికానికి జాలిపడి ప్రస్తుతం ఆ యింట్లో వుండనిచ్చారు. కావమ్మగారు కూతురిపెళ్ళి ప్రసంగం ఎత్తినప్పుడల్లా రామేశంగారికి నెత్తిన పిడుగు పడ్డట్టుగా వుండేది. కావమ్మగారి చేతికివున్న రెండు జతలగాజులు అమ్మేస్తే ఎంత గొప్పగా వచ్చినా ఒకవందరూపాయలు వస్తే ఎక్కువ. ఏదోవిధంగా లేనివాళ్ళలాగ ఒక్కరోజు పెళ్ళి, నిరాడంబరంగా చేసుకున్నా ఆ వందరూపాయలు కట్నకు చాలేటట్టు టికి కష్టం. కట్నకు ఎట్లాగో సరిపెట్టుకోవచ్చునే అనుకొని సంబంధాలకోసం వెతకి మొదలుపెట్టాడు. సరళకు అప్పుడే పదహారో ఏడొచ్చింది. సరళ వయస్సుకు తగిన యీడుగల పిల్లవాడు ఎక్కడ దొరకాలి! శారదాబిల్లు వచ్చిందన్న మాటేగాని బాల్య వివాహాలు ఎక్కడ ఆగినై? ఏ నైజాం యిలాకా గ్రామాలకో పోయి ఎవరికి వాళ్ళు రహస్యంగా బాల్యవివాహాలు చేసేస్తూవుంటే, పాపం రామేశంగారికి ఎదిగిన పిల్లవాడు కావాలంటే ఎక్కడ దొరుకుతాడు? ఎక్కడవున్నా తగిన సంబంధంవున్నా ఎవరికి వాళ్లు వందలూ...... వేలూ......కట్నాలు గుంజాలనేవాళ్ళే. పొట్ట గడవటమే కష్టంగా వుంటే కట్నాలు ఎక్కడ తెచ్చియిస్తాడు! రోజు రోజుకు యింట్లో కావమ్మగారి పోరు జాస్తి అవుతున్నది. మొగవాడు లేగల స్థితిలో వున్నా లేకపోయినా ఆడవాళ్ళకు ఆయా సమయాలకు అన్నీ సరిగ్గా సమకూరాలంటారు. అంతేకాని మొగవాళ్ళ సాధకబాధకాలలో ఆడవాళ్ళకేమీ లోక్యంవుండదు.

రామేశంగారికి సరళపెళ్లి ఎట్లాచెయ్యటమా అనే దిగులు ఎక్కువైంది. ఆస్తిపాస్తులైనా వున్న వాళ్ళకే యిస్తారు కాని లేనివాళ్లకెవరిస్తారు? రోజు రోజుకు మనోవ్యాధివల్ల రామేశంగారు కృశించి పోతున్నారు. తినేతిండి వంటబట్టక బలహీనం ఎక్కువైపోయింది. ఆఖరుకు మంచం ఎక్కాడు. అవూళ్ళో ప్రసిద్ధికెక్కిన నాటువైద్యుడు రోజా వచ్చి చెయ్యిచూచి ఎర్రమాత్రలు నల్లమాత్రలు ఏవేవో మందులు యిస్తున్నాడు. రోగాలకైతే మందులు కాని మనోవ్యాధికి మందులేమి పనికొస్తాయి?

జబ్బుయేమీ తినుగు మొఖంలో లేదు. కామమ్మగారు కూడా భర్తరోగంవల్లం వేళకు తిండి నిద్రలేక చిక్కి శల్యమైపోతున్నది.

రామరామ రామేశంగారు పగలూరాత్రిళ్లుకూడా 'నాకు కట్నాలకు ఎట్లా దబ్బుపుడుతుంది! నేను సరళ పెళ్లి యెట్లాచేసేది!' అని ఒకటే పలవరించటం మొదలుబెట్టాడు.

సరళ యిన్నాళ్లు తనతండ్రికి యేదో మామూలు గానే జబ్బుచేసిందనుకొంటున్నది. కాని యీపలవ రింతలమూలాన తన తండ్రికివచ్చిన రోగానికి కారణం తానేనని గ్రహించింది. తనకు పెళ్లి చేయలేకపోయి నందుకేగదా తనతండ్రి మనోవ్యాధిచేతమంచంపట్టాడు; తల్లికూడా యీదిగులుచేతనే కృసించిపోతూవుంది. తన తల్లితండ్రులకు కలిగిన దుఃఖానికి కారణము తానే అని గ్రహించినప్పటినుంచి సరళకు చాలా కష్టంగా వుంది. ప్రపంచంఅంతా కట్నాలకోసం ఆడపిల్ల తల్లి తండ్రులను పీడించటం చాలా అసహ్యం అనిపించింది. వున్నవాళ్లు యిస్తే యిస్తారు కాని లేనివాళ్లను పీడిస్తే యేమిలాభం? ఎట్లాగైనా తనతల్లితండ్రులను యీ చిక్కులోనుండి తప్పించాలనుకొంది.

తండ్రి మంచంవద్ద తనతల్లికూడా కూర్చునివుంది. సరళ మెల్లగా తండ్రి మంచందగ్గరకుపోయి నిలుచుండి తన తల్లితండ్రుల స్థితిచూడగానే చాలాదుఃఖం కలిగింది. వీరిని యెట్లా యీసంకటంలోనుండి తప్పించటమా అని ఆలోచిస్తూవున్నది. మనస్సులో యేమి ఆలోచన తట్టిందోగాని సరళ ముఖానవున్న క్లేశపుండి సంతోషం కనబడుతున్నది.

“నాన్నా! నాన్నా!” అని పిలిచింది. రామేశం కళ్లుతెరచి వింటూవున్నాడు... “నాన్నా! నీవు నా పెళ్లినిగురించి దిగులుపడవద్దు. దానివేళవస్తే క్షణంలో అదే అయిపోతుంది. నావిషయంలో మీరుమాత్రం దిగులుపడకుండా వుండండి.” అని చరచర వెళ్లి పోయింది. మరుక్షణమే బావిలో యేదోపడ్డట్టు పెద్ద చప్పుడయింది. అర్ధగంటసేపట్లో వారూవీరూఅంతా చేరి బావిలోంచి సరళశవాన్ని బయటకులాగి వడేశారు. అర్ధముకుర్ధమెరగని సరళ చావుకు యెవరు బాధ్యులు?



# భాగ్యరేఖ

శ్రీమతి కో. లీలావతిగారు

పెంచితి గులాబి నెంతయుఁ బ్రేమతోడ
ముద్దులొలికెడి మధుకంపుఁ బూలుపూచె
నాగులాబినిఁ జూచి నా యంతరాత్మ
మురిసిపోయె సంతసములో మునిగిపోయె.
ముడిచి తొలుక మోహనసుమము ముద్దుకృష్ణు
నతియువోజార విడచితి నొక సుమంబు

బురదలో బలిమినిలాగి పొగరుచేత
కాలఁద్రొక్కె నొండొక పూవు కన్నయొకతె
భళిర! యొకచెట్టు పూలకే భాగ్యరేఖ
లస్తమించుట యుదయించు టరయనెంతొ
వింత యనుచును దెలియనే వేడ్కపడితి
తెలియజాలక నే నంత తెల్లపోతి.

దంటే, అందులోనూ అది ఆడవాళ్ల సంబంధమైనదైతే దానితో పెద్దతతంగం అంతా జరగాలిసిందే. విందుచేసే ఆవిడ ఓ గుడ్డలో టీఆకు వేసి దానిలోనుంచి వేడి వేడినీళ్లుపోసి ఓ పెద్దగిన్నెలోకి అన్నీ తీస్తుంది. అంతేగాని మనలా కాగుతోన్న నీళ్లల్లో టీఆకు వెయ్యరు. ఈ టీమాత్రం చాలా రుచిగానూ చాలా సువాసనకలదిగానూ తయారుచేస్తుంది. టీ తయారుచేసి అందరి మెప్పుపొందిందంటే ఆమె పాకశాస్త్రంలో నిపుణురాలన్నమాట. తర్వాత ఆ టీపార్టీకి పిల్వబడ్డ అతిథులు ఒక్కొక్కరే వస్తారు. వాళ్లు ఆగదిలోకి వెళ్లడంలోనేవుంది వారి తంతంతా. ఆగదికి మామూలుగా పెద్దగుమ్మం వుంటుంది. ఆగుమ్మంలో, యిక్కడ మనకి పెద్దకాంపౌండుగేటులో ఓచిన్న గేటున్నట్టు, ఓచిన్న గుమ్మముంటుంది. అందులో అసలు చిన్నవాళ్లే వెళ్లటం చాలాకష్టము. అంచేత యీ అతిథులందరు కేవలం ప్రాకివెళ్లవలసిందన్నమాటే. తర్వాత యీగుమ్మానికెదురుగా వాళ్ల దేముడిపటాలు వుంటాయి. వాటిముందు సాష్టాంగపడాలి. కొ నిమిషాలు ప్రార్థించి అప్పుడు గదిలోకివెళ్లాలి. ఇల్లా ప్రతిఅతిథివచ్చి బల్లదగ్గిరికివచ్చి కూర్చున్నతర్వాత విందుచేసే ఆవిడ ఓ పెద్దగ్లాసులో 'టీ' పోసుకుని వచ్చి ఎవరిగౌరవానికి చిహ్నంగా తాను విందుచేస్తోందో ఆమెచేతిలో పెడుతుంది. ఆమె దాని లోని టీని రెండు మూడు గుక్కలు తాగుతుంది. ఆతర్వాత ఒక్కొక్కరికి ఆ పెద్దగ్లాసు ఇవ్వబడుతుంది. అందరూ అల్లాగే రెండు మూడు గుక్కలు త్రాగుతారు. తర్వాత అతిథులందరు సీతాకోక చిలకల్లా వరసాగ్గా నిలబడి ఆసలామెకు నమస్కారాలు చేస్తారు సగంవంగి. అప్పుడు మళ్లీ పెద్దగేటు తెరవబడుతుంది. అందరూ వెళ్లిపోతారు.

## నవనాగరకులనుకునే ఆంగ్లేయుల పెళ్లిళ్లలోని పిచ్చినమ్మకాలు

జూన్ మాసంలో వివాహంకాని ఆ ఏర్పాటులు కాని జరిగితే, ఆ దాంపత్యానికి ఎక్కువ సౌఖ్యమూ వుంటుంది, సంవత్సరంలోని మిగతా నెలల్లో అయిన వాటికన్నా. ఎంచేతంటే జూన్ నెలకు జూనో అధిపతి. జూనో అనే దేవత ఎప్పుడూ ఆడవాళ్లని రక్షిస్తూవుంటుంది.—

పెళ్లిళ్లకి ఆదివారమంత అర్థాన్నమైనరోజు యింకోటిలేదు. ఎంచేతంటే, వాళ్ల దేవుడైన క్రీస్తును ఆరోజున పుట్టించారు గనుక. శుక్రవారమంత మంచిరోజు మరోటిలేదు. శుక్రవారానికి ప్రేమ దేవతైన 'వీనస్' అధిదేవత.

పెళ్లి సోమవారంనాడైతే, పెళ్లికూతురు తెల్లటిదుస్తులు ధరించాలి. మంగళవారమైతే ఎరుపు; బుధవారమైతే ఆకుపచ్చ; గురువారమైతే ఎరుపు నీలిరంగు కలసిన ధూమ్రవర్ణము, శుక్రవారమైతే నీలిరంగు, శనివారమైతే చిక్కని నీలిరంగుఛాయ ఈ విధంగా దుస్తులు ధరించాలి.

నారింజచెట్టుయొక్క లేత ఆకులు పువ్వులు తీసుకొచ్చి పెళ్లికూతురు తలకి అలంకరిస్తారు. అల్లా చేస్తే సంతానవంతురాలౌతుందని వారి నమ్మిక.

పెళ్లిరోజు వుదయం పక్షికూతలు విని నిద్రనుంచి మేలుకొందంటే, తాను పెళ్లాడబోయే వరునికి తనకి ఎప్పుడూ దెబ్బలాటలు రాకే రావు.

ఆరోజు వుదయాన గోరువంకపక్షి ఎగురుతూఎగురుతూ వచ్చి, ద్వారబంధంమీద వాలిందంటే, ఇంక చెప్పాలా, ఆ వధువు జీవితమంతా సుఖప్రదంగానే సాగిపోతుంది.

ఇళ్లల్లో తిరిగే పిల్లిని మాత్రం మరిచిపోకూడదు. ముఖ్యంగా వివాహమయ్యే రోజున, వధువు ఆపిల్లికి కడుపునిండా ఆహారంపెట్టి, చర్చికి తనతోగూడా తీసుకుపోవాలి. లేకపోతే, పిల్లి తన అధీనంలో వున్న దెయ్యాలకి భూతాలకి పురేకం కలిగించి, వధువుకు చాలాబాధలు కలుగజేస్తుంది.

వివాహపు దుస్తులుగాని, వుంగరంగాని వివాహం కాబోయేలోగా ధరించకూడదు. ఒకవేళ ఆ వుంగరం పట్టకపోతే, వేరే ఇంకో వుంగరం చేయించుకుని ధరిస్తే వధువు తప్పకుండా 'వితంతువు' అవుతుంది. తన వివాహపు దుస్తులు వేసుకొని వుండగా పెళ్లి అయ్యేలోగా వరుడు చూడకూడదు. అంతేగాక, తన అలంకారం తానుకూడా చూచుకొనేందుకు వ్యవధి చాలకుండా వున్నప్పుడు దుస్తులు వేసుకొని చర్చికి పోవాలి. యీ దుస్తులు ధరించడంలో ఏదైనా తప్పువుండంటే, వధువు చాలా దురదృష్టవంతురాలౌతుందన్న మాట.

వధువుతండ్రి, వధువు తొడిగి వేసిన పాతచెప్పు ఒకటితీసి వరుడికిస్తాడు. అతను దానిని వధువు నడినెత్తికి తాకించి తీసివేస్తాడు. దీని అర్థమేమిటంటే, వధువుయొక్క బాధ్యత తండ్రి వరుడికిచ్చేస్తున్నాడని, వరుడు దాన్ని స్వీకరిస్తున్నాడనీ. ఆ జోడే, వాళ్లు 'హనీమూన్'కి వెళ్లేటప్పుడు వారి వాహనానికి తగిలించుకుంటారు. అది అయిన తర్వాత ఆ జోడును ఎగురవేస్తాడు వరుడు. చాలామంది అవివాహితలు దాన్ని పట్టుకుందుకు ప్రయత్నిస్తారు. ఎవరికి అది దొరికితే, ఆ పిల్లకు త్వరలో పెళ్లి అవుతుందన్నమాట.

పెళ్లి అయిన తరువాత ఓ పెద్దరొట్టె తీసుకువచ్చి వధువు తలమీద పెట్టి ముక్కలుముక్కలుగా కోసి, ఆ పెళ్లికూతురు అభిమానుల కిస్తారు. అల్లా యిస్తే వాళ్ల అందరి ఆశీర్వచనలు ఫలిస్తాయిట. వధూవరుల పేర్లకి ముందుండే initials కలిపితే 'love' అనేపదము ఏర్పడిందంటే, ఆ దంపతుల ప్రేమ అనన్య సామాన్యంగా వుంటుంది—

## అతి ప్రాచీనమైన మహాభారత లిఖితప్రతి

పూనాలో భండార్కర్ ఓరియంటల్ రీసెర్చి యిన్‌స్టిట్యూటువారు మహాభారతం ప్రాచీన ప్రతులన్నిటినీ సంపాదించి పరిమార్చి ఒక సమగ్రమైన మహాభారతగ్రంథాన్ని సిద్ధపరచి ముద్రించి ప్రకటించడానికి పూనుకున్నారు. నేపాళ భాషలో వ్రాయబడ్డ ఆదిపర్వం ప్రతి ఒకటి యిప్పుడు దొరికింది. ఇది 800 యేళ్లక్రితం వ్రాయబడింది. కాబట్టి అన్ని ప్రతులలోను యిది చాలా ప్రాచీనమయింది. నేపాళంలో మిక్కిలి విఖ్యాతుడైన మాన్యవరగుండే హేమరాజ పండిట్‌గారు దీన్ని సంపాదించారు. ఇది తాటాకులమీద సిరాతో వ్రాయబడింది. అందుకలవ అక్షరాలు స్పష్టంగా కనపడటంలేదు. దీనిలో ఆదిపర్వం ఒక్కటేవుందిగాని, అది పూర్తిగావుంది. ప్రతి తాటాకుమీద ఏడేసిపంక్తులువున్నాయి. అక్షరాలన్నీ ఒక్కమోస్తరుగానే వున్నాయి. ఆఖరుఆకుమీద 4½ పంక్తులుమాత్రమే వున్నాయి. ఆకులేవీ పోలేదు. ఒకఆకు పొడుగు 21 అంగుళాలు. వెడల్పు 2¼ అంగుళాలు. దీనిమీద వ్రాయబడినతేదీ లేదు. కాని ఇది 800యేళ్ల నాటిదని నిర్ధారణగా తేలింది. ఇటీవల గ్రంథాలలోవున్న క్రొత్తవిషయాలేవీ దీనిలోలేవు. బ్రహ్మగణేశ సంవాదం, సూర్యునకు అరుణుని సారథ్యం, ధృతరాష్ట్రుని నూరుమంది కొడుకులపేర్లు, అభిమన్యుని పుట్టుక, కర్ణునిపుట్టుక, మాద్రివివాహం వివరాలు, జలక్రీడ వివరాలు, పాండవులు పాంచాలదేశాన్ని జయించడం, ద్రుపదరాజును పట్టితెచ్చి ద్రోణాచార్యునికి గురుదక్షిణగా యివ్వడము, ధర్మరాజును యువరాజుగా పట్టాభిషేకం చెయ్యడం మొదలయినవేవీ దీనిలోలేవు.

—ఆంధ్రవార పత్రిక.

# పత్రికాపరిచయము

## ఆనందవాణి

ఇది త్యాగరాయనగర్, మద్రాసు నుండి వెలువడుచున్న జాతీయవారపత్రిక — వెల 1 అణా సం|| చందా రు. 3-0-0.

ఇది శ్రీయుతులు పువ్వులూరి కాళిదాసు, గరిమెళ్ల సత్యనారాయణగార్ల సంపాదకత్వము వెల్వడుచున్న సచిత్రవారపత్రిక. రెండవసంపుటం, రెండవసంచిక మా కార్యస్థానం చేరింది. దీనిలో వార్తప్రసంగాలు, కథలు, వ్యంగచిత్రాలు వున్నాయి.

అన్ని వారపత్రికలలా కాకుండా, సంపాదకులు దీనిని 1/8 డెమ్మీ సైజులో 64 పేజీలు పుస్తకరూపంగా ప్రకటించటంచేత ఓ కొత్తపంథా, ఓ క్రొత్త ఆకర్షణ దీనికి వుంది. అచ్చు చాలా చక్కగావుంది. పుస్తకం ఎంత ఆకర్షవంతంగా వుందో, లోపలివిషయాలుకూడా అంత హృదయంగమంగా వున్నాయి.

జగమెరిగిన బ్రాహ్మణునికి జందెమేలన్నట్లు, 'మా కొద్దీ తెల్లదొరతనము' పాటకర్తలు, సుప్రసిద్ధ పత్రికా రచయితలైన, శ్రీ గరిమెళ్ల సత్యనారాయణగారి సంపాదకత్వాన వస్తూవున్న యీ పత్రికను ఆంధ్ర మహాశయులు అన్నివిధములా ఆదరిస్తారనడానికి సందేహంలేదు — ఆర్థిక వడగాడ్పులు లేకుండా, యీ పత్రిక ప్రయోజన విజ్ఞానమునకై పదికాలాలు పాటుపడుతుందని విశ్వసిస్తాము.

## ప్రజామిత్ర 'సంక్రాంతిసంచిక'

ఇన్నాళ్లనుండి ఎదురుచూస్తున్న ప్రజామిత్రవారి సంక్రాంతిసంచిక మా కార్యస్థానం చేరింది. మామూలు ఆకారంగాక పుస్తకరూపంలో ప్రకటించారు దీన్ని. లోపల విశ్వనాథకవిరాజు ప్రముఖులకథలు, జాషువ మొదలైనవారి పద్యాలు, వ్యంగ్యనాటికలు, గీతాలు మొదలైన విశేషాలు చాలా సరసంగానూ, భావయుక్తంగానూ వున్నాయి. కాంచనమాల త్రివర్ణచిత్రాలు, గోపీనాథ్ తంగమణి దంపతుల భరతనాట్య భంగిమలు మొదలైన చిత్రాలలో చాలా ఆకర్షవంతంగా వుంది సంచిక. అందరూ చదువతగింది. వెల నాలుగుఅణాలు అందరు ఏజంట్లవద్దా దొరుకుతుంది.

## మహతి 'సంక్రాంతికానుక'

సంపాదకులు, వాసిరెడ్డి వేంకటసుబ్బయ్యగారు, తెనాలి.

మామూలు ఆకారంలోనే, మూడుపేజీలతో, విపంచి రంగుముఖచిత్రంతో, బొడ్డు బాపిరాజు, గజపతి రాయివర్మ, కొడవటిగంటి కుటుంబరావుగార్ల ప్రముఖరచనలతో, సంక్రాంతికానుకగా ఆంధ్రమహాజనులకి అర్పించారు దీన్ని సంపాదకులు. అచ్చు ముచ్చటగా వుంది. సంచిక చాలా ఆకర్షవంతంగా వుండి, మహతి పేరు సార్థకం చేసుకుంది.

## నేతపరిశ్రమ

సచిత్రమాసపత్రిక. సంపాదకులు : కార్యంపూడి నాగేంద్రుడు, బి.ఎ., బి.ఇడి., గారు, పుల్లంపేట. సంవత్సరంచందా రు. 1-0-0 విడిసంచిక 2 అణాలు.

ఈ పత్రిక 1-వ సంపుటము 5-వ సంచిక మా కార్యస్థానం చేరింది. పత్రిక ఆకారం ¼ డెమ్మీసైజు. దీనిలో పారిశ్రామికులను ప్రోత్సహిస్తున్న పద్యాలు, వ్యాసాలు వున్నాయి. అన్నివిధాలా చేనేత పరిశ్రమను అభివృద్ధిలోకి తీసుకరావడం యీ పత్రికయొక్క ఆదర్శం—'కోటిమందికి గంజిపోస్తున్న' మగ్గంయొక్క చిత్రం ముఖపత్రంమీద ముచ్చటగా వుంది. భారతభాగ్యవిధాతయైన యీ పరిశ్రమ తాలూకు పత్రికయైన దీనిని అన్నివిధాలా ఆంధ్రమహాజనులు ఆదరిస్తారని ఆశిస్తాము.

### బా ల భా ర తి

ఇది తాడినాడనుండి వెలువడుతోన్న మాసపత్రిక. సంపాదకులు నంబూరి సుబ్బరాజుగారు, చిరునామా: 'శ్రీ బాలభారతి పత్రికాకార్యాలయం, తాడినాడ, కైకలూరుతాలూకా, కృష్ణాజిల్లా. సంవత్సరచందా రు. 1-8-0, విడిప్రతి రెండు అణాలు.

1/4 డెమ్మీ ఆకారంలో చాలాబాగుంది పత్రిక. ఇది ఆంధ్రదేశ సాంఘిక పరిస్థితులను చక్కపరచడానికి, స్త్రీవిద్య, సంఘసంస్కరణాది వివిధవిషయాలకోసం పాటుపడే మాసపత్రిక. వీరి అభిమతాని జయము జేయను ఆంధ్రమహాశయులు కలుగజేస్తారని నమ్ముతున్నాము.

### లా రి పో ర్ట ర్

సంపాదకులు : పిశిపాటి వేంకటసుబ్రహ్మణ్యంగారు, బాపట్ల, గుంటూరుజిల్లా—సంవత్సరచందా రు. 8-0-0, విడిప్రతిక 2 అణాలు.

మొదటి సంపుటము 5-వ సంచిక మా కార్యాలయం చేరింది—ఇందుహిందూ లా, ప్రొవిన్షియల్ ఇన్సాల్వెన్సీ అక్టు, మొదలైన న్యాయశాస్త్ర వ్యాఖ్యానాలున్నాయి—కేవలము చట్టసంబంధమైన పరిశీలనకు చాలాబాగా వుపకరిస్తుంది.

### గ్రా మో ద్యో గి

సంపాదకులు : బుద్ధిరాజు లక్ష్మీహనుమంతరావుగారు, కొండపల్లి, కృష్ణాజిల్లా. సంచిక ఒకఅణా.

గ్రామ-వుద్యోగుల వంశపారంపర్యప్రహక్కులు, సంఘీభావము పరిశ్రమలు, పంచాయితీలు, మొదలైన ఆశయాల పరిపూర్తికొరకు పాటుపడుతుంది మాసపత్రిక.

కొండపల్లి ముఖచిత్రతో, ప్రముఖులవ్యాసాలతో నిండివుంది. అచ్చు చాలా బాగుంది—భారత భాగ్యసౌధ నిర్మాణాని పునాదిరాయి అయిన గ్రామోద్యోగియొక్క వికాసమే దేశవికాసము. ఈ మహత్తర కార్యమునకు గడంగిన యీ పత్రికకు స్వాగతమిస్తున్నాము.

### సే వ

సంపాదకులు : డాక్టరు సేపూరి యల్లమందయ్యగారు, గిద్దలూరు, కర్నూలుజిల్లా. సాలుచందా 1-8-0, విడిప్రతి రెండు అణాలు

దేశసేవ, ప్రజాసేవచేయుటే ఆశయముగల పవిత్రమాసపత్రిక—ప్రకటించే వ్యాసాలలోనూ అచ్చు విషయంలోనూ కొంచెం శ్రద్ధతీసుకుంటే పత్రిక అభివృద్ధిచెంది భారతమాత సేవచేస్తుంది 'సేవ.' సంపాదకుల ఆశయము తీరేదుగాక!

# గ్రంథ సమీక్ష

## ముద్దు - పాపాయి

కర్త : శాళం కృష్ణారావుగారు. ప్రకటనకర్తలు : నవ్యకార్యాలయం, పోస్టుబాక్సు 251, మద్రాసు. వెల ఆరు అణాలు.

దీనిలో ముద్దు, పాపాయి అనే రెండు ఖండ కావ్యాలున్నాయి.

'ముద్దు'లో 'ముద్దుబోలిన వింత మహిని కలదా' అనే అద్భుత మాధుర్యాలని చూపిస్తూ ముద్దుని నిర్వచించారు.

"పాపాయి"లో వియోగ విలాపాలను వివరిస్తూ, సానుతాపాన్ని హృదయము నీరగునట్లు రచించారు. రచన చాల బాగున్నది. ఇది వారి 'మధుర కవి' బిరుదానికి ఓ వన్నె చేకూర్చింది.

## ప్రభుత్వము

కర్త : శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు. ఇదీ నవ్యకార్యాలయం వారిచేతనే ప్రకటింపబడింది. వెల ఆరు అణాలు.

ఇందు ప్రభుత్వమనగా నేమి, మూల విధములు, మూడుశక్తులు, శాసననిర్మాణస్వరూపము, శాసననిర్వహణస్వరూపము, శాసన వివరణస్వరూపము అను ఆరుభాగములున్నాయి. ఇది చదివితే, నేటి ప్రభుత్వ మండలి పద్ధతులు, అది నడిచే విధానం, అందు శాఖోపశాఖలయొక్క ధర్మములు వివిధ దేశాలలోని రీతులు మొదలైనవిషయాలు సమగ్రంగా తెలుసుకో వచ్చు. అందరూ చదువదగినది. ఇది గ్రాంథికంలో గాక, వ్యావహారికంలో రచించి వుండినట్టయితే ఇంకా బాగుండేది.

## బుచ్చిబాబు కథలు

కర్త : 'బుచ్చిబాబు.' ఇదీ నవ్యకార్యాలయం వారి చేతనే ప్రకటింపబడింది.—ఇది ఆంధ్ర కథావళి—ఐదవ భాగము—వెల ఆరు అణాలు.

దీనిలో మల్లెపూలు, కలలో కార్చిన కన్నీరు, చిన్ని, అగోచరుడు, నెపోలియన్ అనే ఐదు కథలున్నాయి—ఐదు కథలు మన నిత్యసంసారిక జీవితానికి వెలుగునిచ్చేవే. ఐదింటిలోనూ, సామాన్యంగా పైకికనపడ్డా అవి మహత్తర విషయాలుగా మారేటటువంటి ఐదు విషయాలను ఆధారంచేసుకుని అల్లబడ్డాయి. కథలు బాగానే వున్నాయి. కాని ఇంకా చిన్నకథకు కావలసిన 'స్పిరిట్' చాలదు.

అయినా, విజ్ఞానము, వివేకము, వినోదము కలుగజేసే వుత్తమ గ్రంథాలను ప్రకటిస్తూన్న నవ్యకార్యాలయంవారు అన్నివిధములైన ప్రోత్సాహానికి అర్హులు.

## త్యాగం

కర్త : గుడిపాటి వెంకటచలంగారు. ప్రకాశకులు:—శ్రీదయానంద గ్రంథాలయ సంఘం, ఎలమఱ్ఱు, కృష్ణాజిల్లా. వెల : ఆరుఅణాలు.

శ్రీదయానంద గ్రంథాలయ సంఘంవారి ప్రథమ ప్రచురణమే 'చలంగారి' యీ 'త్యాగం' అనే సాంఘిక నాటకము.—

మానవ జీవితంలోని యదార్థాన్ని, మనస్సులోని అచంచల భావాన్ని, నేటి సంఘంలో వుండే కుళ్ళుకు, ప్రేమతత్వం యొక్క సత్యస్వభావాన్ని ప్రదర్శించడానికి 'చలం' గారు అందజేసిన చేయి. వారి ఆదర్శాన్ని సమర్థించడంలో యున్న ఆ నైపుణ్యం ఆ భావాల జీవం, ఆ పదముల పొందిక, ఆ చమత్కారానికి ఆయనకాయనే సాటి.

భర్తవ్యభిచారి. భార్యకి తనభర్తంటే గాఢమైన ప్రేమ. భర్తని ఆవేశ్యపాలిటినుండి తప్పించడానికి

భార్య తన శీలాన్నికూడా త్యాగంచేసింది యీ 'త్యాగం'లో. ఇందులో 'చలం'గారు యింకో మెట్టు పైకే వెళ్లారు. త్యాగానికి, అసలైన సత్యస్వరూపాన్నిచ్చి, ఓ క్రొత్త ఆదర్శాన్ని దీనిలో సృష్టించారు.

నిజంగా 'చలం'గారి రచనలోనే ఒక విశిష్టత వుంది. వారి పుస్తకాల్లో ఒరవడ్లు చాలావుంటాయి. మచ్చుకి 'ఆకాశం అందం ఎంతమందిచూస్తారు నీలం గాకా పెంకు వేయకుంటారుగాని' 'తమ గార్లే పిల్లల మాస్తరు' 'ప్రేమఅంటేనే త్యాగం' మొదలైన పసిడితునకలు చాలావున్నాయి.

మొదలెట్టాక ఒక్కగుక్కలో చదువుకుంటూ చదివించింది; అంతబాగుంది నాటకం.

## సుకుమారి

కవి: శ్రీ కొత్తపల్లి సుందరరామకవిగారు. ప్రకాశకులు: శ్రీ అన్నపూర్ణాదేవి స్మారకసంఘం, పిల్లి రోడ్డు, బెజవాడ. వెల 4 అణాలు.

శ్రీ మాగంటి అన్నపూర్ణాదేవిగారి జీవితాన్ని పద్యరూపంగా వ్రాయబడిన చిన్నగ్రంథము. ఆంధ్ర మహిళాలోకానికి ఆదర్శప్రాయురాలగు శ్రీ అన్నపూర్ణాదేవిగారి జీవితం ఇందులో చక్కగా సులభశైలిని వ్రాయబడింది.

## సీతారామము

రచయిత్రి: శ్రీ కలగర అన్నపూర్ణాదేవిగారు, ప్రకాశకులు: శ్రీ అన్నపూర్ణాదేవి స్మారకసంఘం బెజవాడ. వెల 0–12–0

"సీతారామము" అను యీ గద్యకావ్యాన్ని శ్రీ మాగంటి అన్నపూర్ణాదేవిగారు తమ 16-వయేట అవివాహితగానుండు రోజులలో రచించియుండుటచే కలగర అన్నపూర్ణాదేవి అని పుట్టింటివారి పేరుతోనే అచ్చైంది.

ఇది శ్రీరామాయణకథ బాలబాలికలకు అతిసులభముగా అర్థమయ్యేటట్లు లలితమైన శైలిలో వ్రాయబడ్డది. ఇట్టి నీతిప్రాధాన్యమైన గ్రంథాలు ఎంత వుపయోగకరమో వేరే వ్రాయ నవసరంలేదు.

## వివాహ మంగళం

ఇది శ్రీ మాగంటి అన్నపూర్ణాదేవి గారిచే రచింపబడింది. వివాహము విషయమై వంగభాషయందు శ్రీ విధుశేఖరశాస్త్రిగారిచే రచింపబడ్డ గ్రంథమును తెనుగులో అనువాదించినారు.

నేటి వివాహములలో జరుగే దుబారాఖర్చుదారులు ఇందులో తెలుపబడ్డ పద్ధతిమాస్తే మొదట గాబరాపడ్డప్పటికీ యీ విషయంలో ఏమీ తప్పులేదని వెంటనే యిట్టి వివాహములకు ప్రోత్సాహిస్తారు, ఇది చదివితే. అసలు వివాహసమస్య చాలా సులభము చేయబడింది యిందులో తెలిపిన పద్ధతి. ఈలాంటిది అందరూ అనుసరిస్తే చాలా క్షేమదాయకం.

## ఆధునికవిజ్ఞానం

కర్త: శ్రీ వసంతరావు వెంకట్రావుగారు ఎమ్. యస్‌సి. మహారాజావారి కాలేజి విజయనగరం—

గ్రంథకర్తగారికి వ్రాసినా, లేక శారదా అండ్ కంపెనీ, విజయనగరం వారికి వ్రాసినా ప్రతులు లభ్యమౌతాయి. వెల ఆరు అణాలు.

నేటి మానవజీవితం ఎదుర్కొవలసిన విషయాలు విజ్ఞాన సంబంధమైనవి చాలావున్నాయి. ప్రాణపరమాణువులు గోల్పోతూన్న నేటి భారతీయ విజ్ఞానం, క్షణక్షణమూ మార్పులుచెందుతూ అభివృద్ధిలోకి వస్తూన్న పాశ్చాత్య విజ్ఞానములమధ్య నిలకడలేని నేటి మానవ జీవితాలను సంస్కరించడానికి యిటువంటి ప్రాక్పశ్చిమ విజ్ఞానాలను సమన్వయించే విజ్ఞానగ్రంథాలు చాలా అవసరం.

ఇందులోవున్న 'సృష్టిరహస్యం' 'నక్షత్రాలు' 'చంద్రలోకయాత్ర' అను మూడువ్యాసాలలోనూ మూడు వివిధ విజ్ఞానవిషయాలని బాగావిశదీకరించారు.

ఇటువంటి పుస్తకాలు ఎన్ని వెలువడినా ఇంకా లోటువుంటూనే వుంటుంది. ఇట్టి విషయాలు అవగాహన చేసుకుంటే నేటి మానవజీవితంలో ఒక మహత్తరమైన మార్పుకలుగక తప్పదు.

## నాగేశ్వరరాయచరిత్ర

కర్త: శ్రీ వి. సూర్యనారాయణశాస్త్రిగారు, పండితులు, మద్రాసు సేవాసదనము, చట్ పట్ పోస్టు, మద్రాసు.

దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ, కాశీనాథుని నాగేశ్వరరావుగారి జీవితచరిత్రను సంస్కృతంలో అతి సులభశైలిని చిన్నపద్యాలలో పండితకవులైన శ్రీ వి. సూర్యనారాయణమూర్తిగారు రచించారు. పుస్తకం నాగర్లిపిలో అచ్చయింది. చాలా ముచ్చటగా వుంది.

ఆంధ్రరాష్ట్రోద్యమ మూలస్కంధమైన నాగేశ్వరుని జీవితచరిత్ర మనకే గాదు, విశాల భారతదేశ జనంతకు ఆదర్శనీయమే. ఇట్లు మన ఆంధ్రమహాపురుషుల చరిత్రలను సంస్కృతంలో గాని, హిందీలో గాని, మరి యితరభాషలలో గాని వ్రాసి ముద్రిస్తే ఉత్తరహిందూస్థానములోగూడ వీరియొక్క ప్రతిభ వ్యాపిస్తుంది. అప్పుడే ఆంధ్రదేశం అన్నిదిక్కులా ప్రసరిస్తుంది. శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారు కొంతవరకు యీఅభిప్రాయమునకు దోహదమిచ్చారు. యీ చరిత్ర సంస్కృతంలో వ్రాసినట్లే వీ రింకా యితర చరిత్రలు వ్రాస్తారని ఆశిస్తాము.

## ముక్తి

రచయిత : శ్రీ వి. కే. విశ్వనాథంగారు, పెదముత్తేవి, కృష్ణాజిల్లా అని వ్రాస్తే ప్రతులు దొరుకుతాయి. వెల రు. 0-3-0.

నేడు ప్రతిగ్రామమందును రకరకముల మనుష్యుల్లో అనేక తీరులు, మెట్టవేదాంతము ప్రబలిపోయింది. సంఘంలో సంస్కారం పేరిట స్వార్థం పెరిగిపోయి, ఉత్తమోత్తములైన వారి చర్యలకి పద్ధతులకి వింతవింత అర్థాలు కల్పించబడి అనేక వికారాలకైన చేష్టలు బయలుదేరుతున్నాయి. ఇట్టి చర్యలను ఖండిస్తూ ఇట్టివారికి ముక్తివుందా అంటూ ఎందరినో పద్యాలలో గానం చేశారు కవి.

పద్యాలలో మంచిసుళువుగం వుంది. కాని చాలా చాలా అశ్లీలాలు వున్నాయి. కవిగారి అభిప్రాయము మంచిదైనా, వెల్లడించే రచనాపద్ధతి బాగా లేక పోవడం మూలాన్ని వారియభిప్రాయం రాణించింది గాదు—

కాని, కొంచెం భాషా సౌష్ఠవాన్ని గుర్తించి ఇట్లాటివే యింకా కొన్ని వ్రాస్తే, కవిగారికి మంచి future వుంది.

## జాతీయ నీతిపద్యములు

కృతికర్త : విజయనగర సంస్థానాస్థానకవి, కవిశేఖర శ్రీ భోగరాజు నారాయణమూర్తిగారు ప్రకాశకులు : డి. వి. శాస్త్రి, శారదా ఆఫీసు, వారు విజయనగరం. వెల రు 0-4-0.

ఇందు, నా జన్మభూమి, గురుభక్తి, అహింస, స్వదేశవస్తువులు, హరిజనుడు, మద్యపానము, సద్వర్తనము, రాజభక్తి అను ఎనిమిది విషయాలమీద బాల బాలికలకు అర్థమానట్లు చక్కని జాతీయ నీతిపద్యాలున్నాయి. నేడు అమలులోవున్న విద్యావిధానము భారతదేశమును ఇంకా బానిసదేశముగానే వుంచడానికి పని చేస్తోంది. ఈ విద్యావిధానములో విప్లవం వస్తేనేగాని మనకి విమోచనమే లేదు—అందుకు ప్రాథమిక విద్య దగ్గరనుండి మార్పు రావాలి. బాల బాలికలకు మొదటినుండి 'అందమా భూమి, నా మాతృభూమి' అనే భావాన్ని వారి ప్రతిరక్తనాళంలోకి ఎక్కించాలి. అప్పుడే దేశానికి విమోచన కలుగుతుంది. ఈ 'జాతీయ నీతిపద్యములు' అనే యిటువంటి పుస్తకాలను పాఠ్యపుస్తకాలుగా పెట్టి విద్యగరపితే, నేటి యువకలోకంలో ఒక మహత్తరమైన చైతన్యం కలిగి భావిభారతభాగ్యోదయానికి కారకులౌతారు. ఇటువంటి పుస్తకాలను యింకా వ్రాయాలని గ్రంథకర్తగారిని కోరుతున్నాము.

# సంపాదకీయములు

## అఖిలభారత మహిళాసంఘ 13-వ సమావేశము

అఖిలభారత మహిళాసంఘ చరిత్రలో గతమాసపు ఢిల్లీ సమావేశము ఒకనూతన శకారంభానికి దారి తీస్తున్నది. ఇంతకాలము నుండీ, కేవలము సాంఘిక దురాచారములను రూపుమాపుటకై ఏవో కొన్ని హక్కులను కోరుకొంటూ, ఒకసాంఘిక పునర్నిర్మాణ సంఘముగానే యుండీ, యీ సమావేశములో తమబాధ్యతలను తాము గుర్తించి, ప్రత్యేకముగా సాంఘిక సంస్కారమేగాక, రాజకీయచైతన్యముకూడా కలిగి, మహిళా సంఘమును ఒకక్రొత్తబాటలో పెట్టి కొంచెం ముందడుగువేస్తోంది. ఇప్పుడు అటు సాంఘికముగానూ, ఇటు రాజకీయముగానూ పని చేయ సంకల్పించినందుకు ముదావహము.

శ్రీ॥ విజయలక్ష్మీపండిట్ గారు, నేడు పాశ్చాత్యఖండములలో ప్రబలుచున్న రాక్షసత్వమును నిరసించుచూ, వారికి నర్సులుగాను మరేవిధముగానుకూడ నారీలోకము సహాయభూతులు కాకూడదని తెచ్చిన యుద్ధప్రతికూల తీర్మానము ఏకగ్రీవముగా ఆమోదింపబడి, భారతస్వాతంత్ర్యనిర్మాణమునకు అహింసయే మూలాధారమని తీర్మానింపబడింది. కేంద్రశాసనసభలో తీర్మానింపబడిన సైనికశాసనం నిరసింపబడింది. దేశీయ 'లేబరు' మొదలగువాటియందు స్త్రీ ప్రాతినిధ్యం కోరబడింది. అండ్రూస్ మహాశయుడు ఉపన్యసిస్తూ యీ సంఘానికి ఒక విదేశశాఖకూడా వుండాలని సలహానిచ్చాడు.

అధ్యక్షత వహించిన రాణీ లక్ష్మీబాయి గారు స్త్రీల అజ్ఞానాన్ని పిచ్చినమ్మకాలని పోగొట్టాలని, నిరక్షరాశ్యతను నిర్మూలించాలని, స్వేచ్ఛాస్వాతంత్ర్యములను సంపాదించి రాజకీయాలలో పాల్గొనాలని హెచ్చరించారు.

ఈ సమావేశపు కార్యక్రమం యొక్క పోకళ్లు చూస్తే, దీనితో భారతమహిళాసంఘ చరిత్రలో ఒక నూతనాధ్యాయం ప్రారంభమయి, వనితాలోకం ఒకమహోజ్వల భవిష్యత్తుకు దారితీస్తున్నట్లు కనబడుతోంది.

మహాత్ముడు యీ సమావేశానికి ఒక మహత్తర సందేశాన్నిచ్చాడు. సాంఘిక దుస్థితి తొలగాలన్నా, ఖద్దరు ధరించి దరిద్ర నారాయణసేవ చేయాలన్నా, ఘోషాపద్ధతి నిర్మూలం కావాలన్నా, హిందూ ముస్లిము సఖ్యత కలుగచేయాలన్నా, అస్పృశ్యతను రూపుమాపాలన్నా, భారతస్త్రీశక్తికి మించిన శక్తి లేనేలేదు. ఇట్టి దేశకల్యాణంకొరకు స్త్రీలోకం, బహిరంగముగా రాజకీయము

లందు పాల్గొనజాలకపోయినను, ఆవిషయము లనుగురించి చర్చించి, సర్వదా కృషిచేయాలి.

మహిళాసంఘంవారు కాలానుగుణ్యమైన సమస్యలను చర్చించి, తీర్మానించడం చాలా అభినందించవలసిన విషయం. వనితాలోకంలో రాజకీయ చైతన్య కలిగితేనే తప్ప, మనస్వాతంత్ర సమరానికి జీవం కలగదు. యీ విషయంలో మహిళామణులు ఏమరుపాటులేక, మహాత్ముని ఆదేశాను సారము ఆ మహత్తర సిద్ధికొరకు పాటుపడి జాతీయవాదుల మన్ననలకు పాత్రులౌతారని ఆశిస్తున్నాము.

## నర్సుల జీతాల సవరణ

గత అక్టోబరు మాసమున వెలువడిన నర్సుల సంబంధమైన ప్రభుత్వాజ్ఞ చాలా అసంతృప్తిని కలిగించింది. ఈ ఆజ్ఞకు నర్సు సంఘాలే గాక, బాధ్యతగలిగిన యితర సంఘాలు, పత్రికలుకూడా తమ అసమ్మతిని తెలిపాయి. అంతట అనేక విజ్ఞప్తు లివ్వబడ్డాయి; అనేకసలహాలు ప్రకటింపబడ్డాయి. డిశంబరు మాసపు గృహలక్ష్మిలో, మేమీ విషయంలో వున్న లోపాలని చూపిస్తూ, అవి ఎంత అనర్థదాయకమో, అవి ఎట్లు కార్యానుకూలము కావో నిరూపించి, ప్రభుత్వాన్ని తత్సంబంధమైన మార్పులు చేయవలసినదిగా కోరియున్నాము.

మొన్న జనవరి 12-వ తారీకున ప్రభుత్వమువారు యిదివర కిచ్చిన ఆజ్ఞలో కొన్ని సవరణలు చేస్తూ తిరిగి ప్రకటించారు.

ఈ సవరణల ప్రకారం సంసారసంబంధమైన అడ్డులు లేనివాళ్లు నర్సులుగా వుండ వచ్చునని, ఆ కోర్సుకు చదువువారికి మొదటి సంవత్సరం నెల 1-కి రు. 10 తర్వాత 2½ సంవత్సరాలకు రు. 15 స్టైఫెండుయిచ్చేటట్లు, నెలభత్యముక్రింద రు. 20, దాసి ఖర్చులకని రు. 2, జీతాలుగాక యిచ్చేటట్లు మార్పులు కావించారు.

అవివాహితలైన స్త్రీలే కాని యితరులిందు చేరరాదనే నిబంధనను మార్చి సంసార సంబంధమైన అడ్డంకులు లేక యీవృత్తిలో నిరాటంకముగ పనిచేయ వీలు కలిగివున్న స్త్రీలు చేరవచ్చునని మొత్తముమీద ఒక మార్పును జేశారు. లంచాలు మగనర్సుల విషయాలేమి ఇందులో ఎత్తబడలేదు.

ఐనను వీటిలోని లోపములను గుర్తించి ప్రభుత్వము కొంతవరకైన సవరణ చేసి యున్నందులకు ప్రశంసించవలసిన విషయం.

మిగిలిన విషయములుకూడా కార్యరూపాన్ని పొందునరికి అందలి లోపములను గూడ ప్రభుత్వము గుర్తించకపోదు. అప్పుడైనా సవరణచేయుదురని విశ్వసిస్తున్నాము.

ఇటీవల మద్రాసు ట్రైన్డు నర్సస్ ఎసోసియేషనువారు ప్రభుత్వముచేసిన సవరణలకు వారి సంతోషమును వెలిబుచ్చుచూ, ప్రభుత్వానికి ఒక విజ్ఞప్తి చేశారు. దానిలో యింకా కొన్ని ప్రభుత్వం గమనించవలసిన విషయాలున్నాయి.

కాంగ్రెసుప్రభుత్వం ఇటువంటి సఫలీకృత కార్యాలకి యీ సదవకాశాన్ని సత్వరంగా వినియోగించుకోవాలని కోరుతున్నాము.

EDITED BY DR, K.N. KESARI, PRINTED AND PUBLISHED
BY| DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

